PARLE

# Poppins colouring contest: Prize-winners roll call.



## 1st prize-winners (Rs. 400 each)

- **Master Mrigendra Kumar Dalui,** Age 8
  16, Kuchil Sarker first bye lane,
  Howrah-711 101.

- **Master Vijay Anand,** Age 5
  C/o. V.S.P. Rao, 49, Purasawalkam High Road,
  Madras 600 007, Tamilnadu

- **Miss Chetnaben D. Patel,** Age 11
  Rajendra Kumar B. Amin,
  Pardeshi Fadia, Madanzanpa Road,
  Vadodara, Gujarat.

- **Master Sanjeev Kumar,** Age 12
  Q. No. 926, Sector 6, R.K. Puram, New Delhi.

## 2nd prize-winners (Rs. 200 each)

- **Miss Mamata Rani Dey**, Age 10
  Sujit Foto Binding, Dolomukh, Sibsagar (Assam).
- **Master Radheshyam Meher**, Age 11½
  C/o. Damodar Meher, At P.O. Tarbha,
  (Ratipara), Dist. Bolangir (Orissa) 767 016.
- **Master Kumar Nandan**, Age 8
  C/o. T. Bhaskar Rao, Navachaitanya Bldg.,
  Hubli Road, Dharwar, Karnataka.
- **Master Johnson Fernandez**, Age 8
  121/17 Subash Market, Hindwadi, Belgaum, Karnataka.
- **Master Valerian Thomas D'Souza**, Age 12
  Western Railway Quarter No. 12/14,
  S. V. Road, Bandra, Bombay 400 050.
- **Master Mukesh Manubhai Patel**, Age 12
  13, Kuniavameshwar Society, Harni Road, Vadodara, Gujarat.
- **Master Prem Singh Bhadari**, Age 11
  Ajbpur Daala, P.O. Nehru Gram, Dehra Dun, U.P.
- **Master Mahesh Kumar Goyal**, Age 11
  C/o. Shri Sukha Ram Goyal, Near Punjab
  National Bank, Kothi, Dholpur (Rajasthan).

## 3rd prize-winners (Rs. 100 each)

- **Master Joy Deep Roy**, Age 11
  C/o. Mr. P.K. Bose, "BASUCHA", Lalbagan
  P.O. Sahaganj, Dist. Hooghly, W.B.
- **Miss Sunanda Patra**, Age 9½
  C/o. P.K. Patra, DR. No. 3 Block Colony, Jagat Singh Pur,
  P.O. Jagat Singh Pur, Dist. Cuttack (Orissa).
- **Master M. Shahbaz "Akhtar"**, Age 11½
  C/o. M. Akhtaruliman P.O. At—Nathnagar (Bhagalpur), Bihar.
- **Master Malay Kumar Karmakar**, Age 12
  13/1, Chidam Mudi Lane, Calcutta 700 006, W.B.
- **Master M. B. Ravi Kumar**, Age 11
  Shanti Bhavan, Boddathoda Post, Sullia 574 239,
  D. Kannada, Karnataka.
- **Master Y. V. Arun**, Age 6
  3-8-131, Hyderguda, Hyderabad 29, Andhra Pradesh.
- **Master L. Ganesh Prasad**, Age 11
  1409 Kothwal Ramaiah Street, Shivarampet, Mysore, Karnataka.
- **Master J. Babu**, Age 11
  St. Louis Institute for the Deaf,
  Adyar, Madras 600 020, Tamilnadu.
- **Miss Shobha Johari**, Age 11
  Savitri Girls School, Civil Lines, Ajmer, Rajasthan.
- **Miss Shashi Lata Chhattri**, Age 11
  H. No. 103/342, Ram Krishna Nagar,
  Kanpur 208 012, Uttar Pradesh.
- **Master Sunil Roy**, Age 12
  N Block, 3/2 M.S. Flats, R.K. Puram,
  Sector 13, New Delhi 110 022.
- **Master Shashikant Jalindra**, Age 11½
  Shri D. J. Hindi Sr. School (Sikar), Rajasthan.
- **Miss Nilima Gajanan Gondhali**, Age 9
  E/100, R.B.I. Staff Quarters, Sion-
  Trombay Road, Chembur, Bombay 400 071.
- **Miss Pushpa Tiwari**, Age 10
  C/o. C.D. Tiwari, E/21/C, O.N.G.C. Colony, Vadodara, Gujarat.
- **Master Arvind Ramchandra Bhatt**, Age 12
  Dabhoiya Pole, Vadi Rangmahal, Vadodara, Gujarat.
- **Master Vishwas More**, Age 11
  C/o. Mr. M.K. More, Anand, P.O. Pimpalgaon,
  Taluka—Niphad, Dist. Nasik, Maharashtra.

**Winners of the consolation prizes (Rs. 25 each) are being informed by post. All prizes will also be sent by post.**

**Parle congratulates all winners and thanks all entrants for making the contest a big success.**

everest/78/PP/105

# చందమామ

ఈ సంచికలో

కథలు - వింతలు - విశేషాలు







# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["సన్యాసివరం"] కు, ఆధారం గంగిశెట్టి శివకుమార్ రచన. లోకంలో చాలామంది స్వార్థపరులుగా కనిపిస్తారు, కొద్దిమంది మాత్రం మహా ఉదారులుగా కనబడతారు. అలాటి వారిలో కూడా స్వార్థం ఉంటుందని లోకం సాధారణంగా గ్రహించదు. కాకులను కొట్టి గద్దలకు వేసిన చందంగా ప్రజలను పీడించి సంపాదించిన సొమ్ముతోనే సత్రాలూ, చలివేంద్రాలూ కట్టించి, గొప్ప దాతలుగా పేరు తెచ్చుకునేవారుంటారు. అలాటి వారి స్వార్థం పైకి కనబడదు. ఆ సంగతి ఈ చిన్న కథలో చక్కగా నిరూపించబడింది.

సంపుటి 62 మే '78 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




యద్యపి ప్రతిపత్తి స్తే
దైవీ చాపి తయో ర్మతం,
తథావ్యుపేక్షణీయం తే
న మేత దపి రోచతే. 1

[జరిగేదంతా దైవకార్యమనుకుంటున్నావు. అది తప్పు. నాకు అదిసరిగా తోచలేదు.]

విక్లబో, వీర్యహీనో యః
స దైవ మనువర్తతే.
వీరా స్సంభావితాత్మానో
న దైవం పర్యుపాసతే. 2

[పరాక్రమం లేనివాడూ, నిర్వీర్యుడూ అయినవాడే దేవుడి మీద భారం వేస్తాడు. తెలివి తేటలు గల పరాక్రమవంతుడు తన కార్యం సాధించుకుంటాడేగాని, దేవుడికి వదలడు.]

దైవం పురుషకారేణ
య స్సమర్థః ప్రబాధితుమ్.
న దైవేన విపన్నార్థః
పురుష స్సో వసీదతి. 3.

[పురుషయత్నంతో దేవుణ్ణి తోసెయ్యగలవాడు దేవుడికి వెరచి దుఃఖించడు.]

పురుషకార్యం




## 59

మాట్లాడిన గుహ కథ చెప్పి, రక్తాక్షి తన అనుచరులతో మరొక కొండకు వెళ్లిపోయి, దానికి తగిన రక్షణలు కల్పించుకున్నది.

రక్తాక్షి వెళ్ళిపోవటం చూసి స్థిరజీవి పరమానందం చెందింది. ''అది వెళ్లిపోవటం నా కెంతో మేలు. అతను దూరదృష్టి గల మంత్రి. మిగిలిన వాళ్ళంతా చవటలు. నా పథకాన్ని పాడుచేయగలవాడు అతనే గాని మిగిలిన వాళ్ళు కారు. ఇప్పుడు నేను నిశ్చయంగా ఈ దుర్గాన్ని, రాజునూ, మంత్రులనూ తుదముట్టించగలను. దూరదృష్టిగల మంత్రులను దూరం చేసుకుని, మూఢుల సలహాలు వినే రాజు పతనం అయి తీరుతాడు.'' అనుకున్నది.

కాలక్రమాన గుహను తగలబెట్టి, అందులో ఉన్న గుడ్లగూబలనన్నిటినీ నిర్మూలించే ఉద్దేశంతో స్థిరజీవి అడవి నుంచి ఎండుపుల్లలు తెచ్చి, దుర్గం లోపల ఉండే తన గూటిలో పెట్టింది. అది చేసే ఈ పనిని రాజుగాని, మూఢులైన మంత్రులుగాని, అనుచరులుగాని గమనించనేలేదు. స్థిరజీవి స్నేహబుద్ధిలో వాటికి అపారమైన విశ్వాసం.

కోటను మొత్తంగా తగలబెట్టటానికి చాలినన్ని పుల్లలను పేర్చిన అనంతరం, ఒక ఉదయం, గుడ్లగూబలు నిద్రపోయే సమయంలో స్థిరజీవి ఎగిరి వెళ్ళి, మేఘవర్ణంతో, ''మహారాజా, శత్రువు కోటను కాల్చి పారెయ్యటానికి అంతా సిద్ధం చేశాను. మీరూ, మీ అనుచరులూ తలా ఒక మండే కొరివి తీసుకుని వచ్చి, నా గూటి మీద వెయ్యండి. దాని నిండా ఎండుపుల్లలున్నాయి. మీ శత్రువులంతా



మంటలలో చిక్కుకుపోయి నాశనమవుతారు,'' అన్నది.

ఈ మాట విని మేఘవర్ణం సంతోషించి, ''బాబూ, నీ కథ అంతా చెప్పు. మనం కలుసుకుని చాలా కాలమయింది,'' అన్నది.

''ఇప్పుడు కాదు, నాయనా. ఇది చేతలకు సమయంగాని, మాటలకు సమయం కాదు. శత్రుగూఢచారులు నేనిక్కడికి రావటం కనిపెట్టి, నా పథకం భగ్నం చేసి, గుడ్లగూబలు తప్పించుకుపోయేటట్టు చేయవచ్చు. ఆచరించదగిన తరుణాన్ని దాటిపోనిస్తే అది తిరిగి లభించకనేపోవచ్చు. నీ శత్రువులంతా చచ్చి, నువు విజయుడవై తిరిగి వచ్చిన అనంతరం తాపీగా కథ యావత్తూ చెబుతాను,'' అన్నది స్థిరజీవి.

మేఘవర్ణమూ, అతని అనుచరులూ తలా ఒక మండేపుల్లా ముక్కుల కరచుకుని, గుడ్లగూబల గుహకు ఎగురుతూ వెళ్ళి, ఎండుపుల్లలు గుట్టవేసి ఉన్న స్థిరజీవి గూటిమీద వేశాయి. పెద్ద పెద్ద మంటలు లేచి, గుడ్లగూబలన్నీ నరక యాతన అనుభవించుతూ, ఆ మంటలలో కాలి మృతిచెందాయి.

తరవాత మేఘవర్ణం విజయగర్వంతో సింహాసనం అధిష్ఠించి, ''బాబూ, నీ అనుభవాలన్నీ ఇప్పుడు చెప్పు,'' అని స్థిరజీవిని అడిగింది.

స్థిరజీవి చెప్పింది.

''నువు రోజూ ఆ గుడ్లగూబ రాజు ముందు ఎలా ప్రణామం చెయ్యగలిగావో ఆశ్చర్యంగా ఉన్నది,'' అన్నది మేఘవర్ణం.

''కార్యం సానుకూలం కావటానికి అలాటి పనులు ఎన్నయినా చెయ్యవలసి ఉంటుంది. అర్జునుడిలాటి వాడు రవికె తొడిగాడు. భీముడు వంట చేశాడు. యుధిష్ఠిరుడు ఒక పేద బ్రాహ్మణుడయాడు. నకుల, సహదేవులు గోవులు కాచారు. ద్రౌపది పరిచారికగా పని చేసింది,'' అన్నది స్థిరజీవి.

''నువు చేసినది అసిధారా వ్రతం,'' అన్నది మేఘవర్ణం.

''అందుకు సందేహమేమిటి? కాని రక్తాక్షి వెళ్ళిపోయిన అనంతరం నా పని చాలా తేలిక అయింది. మిగిలిన వాళ్ళు మూఢులు. అలాటి వాళ్ళను వంచించటం చాలా తేలిక. మూఢుల్ని మెచ్చుకో; తిండిపోతులను మేపు; లోభులను బహూకరించు; దరిద్రులకు అప్పులియ్యి; విద్వాంసుడికి గ్రంథాలియ్యి; రాజుపట్ల విధేయతగా ఉండు—నీ పని నెరవేరుతుంది. అయితే కొంతకాలంపాటు, మందవిసర్పం అనే పాము కప్పలను మోసినట్టుగా, ఆ మూఢులకే అణగి మణగి ఉండవలసి ఉంటుంది," అన్నది స్థిరజీవి.

''ఏమిటా కథ?'' అని మేఘవర్ణం అడగగా, స్థిరజీవి ఇలా చెప్పింది:

మందవిసర్పం అనే పాము ముసలిదై పోయి, ఎలా బతకాలా అనే ఆలోచనలో పడి, ఒక కప్పలమడుగు వద్దకు వెళ్ళి, పుట్టెడు విచారంలో ఉన్నట్టు నటించింది.

ఒక కప్ప నీటి అంచుకువచ్చి, "మామా, ఇవాళ వేటకు పోలేదేం?'' అన్నది.

''బాబూ, నావంటి దౌర్భాగ్యుడికి తిండియావ ఎలా ఉంటుంది? నిన్న రాత్రి తిండికోసం బయలుదేరి ఒక కప్పను చూసి, దానిని వడిసి పట్టబోయాను. అది ఎగిరి నీటిమడుగులో దూకింది. అక్కడ నీటి అంచున కొందరు బ్రాహ్మణులు మంత్రాలు చదువుతున్నారు. నేను ఒక బాలుడికాలు చూసి, దృష్టి సరిగా ఆనక, కప్ప అనుకుని కరిచాను. ఆ బాలుడు వెంటనే మరణించాడు. అతడి తండ్రి నన్ను శపించి, 'నీ జన్మ అంతా కప్పలను వీపు మీద మొయ్యి,' అన్నాడు. అందుచేత మిమ్మల్ని మొయ్యటానికి వచ్చాను,'' అన్నది పాము.

ఈ వార్త కప్పలకన్నిటికీ తెలిసింది. అవి సవారీ చేయటానికి వచ్చాయి. ముందు పడగ దగ్గిర కప్పరాజు జాలపాదమూ, తరవాత మంత్రులూ తక్కువ హోదాగలవాళ్లూ వరసగా కూర్చున్నాయి.



# 197. ఒళ్లు దాచుకోని వీరుడు

ప్రపంచంలో తొలి నాగరికతగా ఎంచబడే సుమేరియన్ నాగరికతను క్రీస్తు పూర్వం 2,000 అనంతరం బాబిలోనియనులు జయించారు. తరవాత 300 ఏళ్ళకు "కాసైట్" జాతివారు బాబిలోనియనులను ఓడించి, దాదాపు 600 ఏళ్ళు పాలించారు. లోగడ బాబిలోనియనులకు లొంగి ఉండిన అసిరియనులు కాసైట్‌లను ఓడించి, ఒక సామ్రాజ్యం స్థాపించారు.

అసిరియనులు వీరులూ, క్రూరులూనూ. అసిరియన్ సామ్రాజ్యాన్ని విస్తరించిన రెండవ సార్గాన్ లాటి రాజులు మహావీరుల కింద జమ అవుతారు. వారిలో చిట్టచివరివాడు అసుర్ బనిపాల్. ఇతను క్రీ. పూ. 668–626 దాకా పాలించాడు. అతని ధాటికి తట్టుకోలేక, అనేకమంది రాజులు తమ కుమార్తెలను అతనికి ఉంపుడుగత్తెలనుగా అర్పించుకున్నారు. అతను యుద్ధాలలో ఎప్పుడూ సేనలకు ముందు ఉండేవాడు. (బొమ్మలో అతను వేటకు పోపటం చిత్రించి ఉన్నది.) ఇతని అనంతరం 14 ఏళ్ళకు అసిరియా సామ్రాజ్యం విచ్ఛిత్తి పొందింది.





# మాయాసరోవరం

## 29

[జయశీలుణ్ణి, మాయాసరోవరేశ్వరుడు తన వెంట తీసుకుపోతున్నాడని తెలిసి, సిద్ధసాధకుడు బయలుదేరబోతున్న సమయంలో, జలవృకరాక్షసులను గురించిన వార్త చేరింది. రాజు కనకాక్షుడూ, సాధకుడూ వెళ్ళేసరికి జలవృకులతో ఘర్షణపడుతున్న దేవశర్మా, యితరులూ కనిపించారు. పారిపోతున్న జలవృకులను నరభక్షకులు తరమసాగారు. తరవాత—]

తమ ఆకలి తీర్చుకునేందుకు, జలవృక రాక్షసుల్లో ఏ ఒకరిద్దరినైనా పట్టుకోవాలనే ఉత్సాహంలో, నరభక్షకులు పరిగెత్తుతున్నారే తప్ప, రాక్షసులు తమను ఏ మార్గాన తీసుకుపోతున్నదీ వాళ్ళు గమనించటం లేదు. ఆ సమయంలో యిద్దరు జలవృకులు గుబురుగావున్న ఒక ఎత్తయిన చెట్టుకొమ్మల్లో దాగివుండి, యీ జరుగుతున్నదంతా గమనిస్తూనే వున్నారు. వాళ్ళు, తమ రాజైన జలవృకనాథుడు పంపగా, ఉదయం నుంచి, ఆ ప్రాంతాల వేగుకాస్తున్నారు.

చెట్టు మీది జలవృకరాక్షసుల్లో ఒకడు, తన పక్కనున్న వాడితో, "ఒరే, మన రాజుకు శత్రుబలం ఎంత పెద్దదో పూర్తిగా తెలిసినట్టులేదు. ఇంతకుముందు సరోవరంలో జరిగిన యుద్ధంలో, ఆ మాయా సరోవరం రాజు బంట్లనందర్నీ, తన్ని



తరిమేశాం గాని, అతడికి మరికొందరు సాయం వస్తున్నట్టున్నది!'' అన్నాడు.

రెండో జలవృకరాక్షసుడు, మొదటి వాడు యింత మాట్లాడినా, వినిపించు కున్నట్టేలేదు. వాడి దృష్టి, మాయాసరోవరం కేసి పారిపోతున్న తన జాతివాళ్ళ మీదా, వెనకవస్తున్న నరభక్షకుల మీదే కాక, మరికొంచెం దూరంలో కొయ్యకాలుతో కుంటుతూ, చేతికర్ర ఊతంతో నడిచివస్తున్న, హిరణ్యపుర సేనాని కొడుకు మంగళవర్మ మీద వున్నది.

జలవృకుడు తనతోటి వాడికి కుంటి మంగళవర్మను చూపుతూ, ''ఒరే, వీణ్ణి పట్టుకుపోయి మన రాజుగారి ముందు పెడితే ఎలా వుంటుందంటావు? వీడి నుంచి, కొత్తగా యీ అరణ్యానికొచ్చిన రాజు వెంట ఎంత బలగంవున్నదో తెలుసుకోవచ్చు,'' అన్నాడు.

''అది బాగానేవుందిగాని, మరి రెండు గుంపులై, మాయాసరోవరం కేసి పోతున్న శత్రువుల మాటేమిటి? వాళ్ళను ఒక కంట కనిపెట్టివుండి, వాళ్ళు ఏం చేయబోతున్నారో మనరాజును ముందుగా హెచ్చరించవద్దా?'' అన్నాడు రెండో జలవృకుడు.

''ఆ పనేదో నువ్వు చూడు. వాళ్ళు పోతున్నది మాయాసరోవరం కేసి. అందులో తెలియరాని రహస్యం అంటూ ఏమీ లేదు. నేను యీ సొట్టవెధవను. భుజాన వేసుకుపోయి మన రాజుగారికి ఒప్పచెబుతాను,'' అంటూ మొదటి జలవృకరాక్షసుడు, చెట్లకొమ్మల్లోంచి దిగి, మంగళవర్మకు వెనకగా నడవసాగాడు.

మంగళవర్మ తనకు రానున్న ప్రమాదాన్నిగురించి శంకించేస్థితిలో లేడు. కాళ్ళున్న వాళ్ళూ, గుర్రాలున్న వాళ్ళూ, హడావిడిలో తనమాట మరిచి, మాయాసరోవరం కేసి పోతున్నారు. తాను వెనకబడిపోయాడు! సాధ్యమైనంత త్వరగా సరోవరాన్ని చేరి, అక్కడ జలవృకరాక్షసులతో జరగబోయే యుద్ధంలో తనూ

తప్పక పాల్గొనాలి. ఒక మనిషి వీరుడవునో కాదో నిర్ణయించేది కాలూ, కత్తికాదు; గుండెబలం!

మంగళవర్మ యిలా ఆలోచిస్తూ పోతున్నంతలో, వెనక నుంచి పెద్ద చప్పుడైె, అతడు చప్పున తల తిప్పి చూశాడు. జలవృకరాక్షసుడు అతణ్ణి వెనక నుంచి హఠాత్తుగా మీదపడి పట్టుకుందామనే ఆదుర్దాలో, తను నడుస్తున్నదారి ఎలావున్నదో చూసుకోక పోవటంతో, వాడి కుడికాలు లోతైన ఒక నెర్రెలో పడగానే, వాడు ముందుకు తూలటంతో రాతిగద పోయి దూరంగాపడింది. వాడు నిశ్శబ్దంగా కాలును బయిటికి లాక్కుందామని ప్రయత్నించాడు గాని, వాడు పడ్డపాటుకు అది మోకాలి దగ్గిర బెణికిపోయింది.

జలవృకరాక్షసుడు బాధతో గొంతెత్తి, "హా, జలవృకనాథా, నువ్వేశరణ్యం!" అంటూ పెద్దగా అరిచాడు.

మంగళవర్మకు తనకు ఎంతస్వల్పంలో ప్రమాదం తప్పిపోయిందో అర్థమైంది. అతడు జలవృకుడి దగ్గిరకుపోయి, "ఒరే, నన్ను పట్టకోబోయి నువు కాలు విరగ్గొట్టుకున్నావు. మంచిశాస్తే జరిగింది. ఇప్పుడు నీక్కావలసింది వైద్యసహాయం. అంతేగాని, ఎక్కడోవున్న మీ రాజు జలవృకనాథుడు నీకు చేయగలిగిందేమీ



లేదు. ఇంతకుపూర్వం మీ జలరాక్షసులు, సరోవరేశ్వరుడి భవనాలమీద దాడిచేశారు గదా? అందులో ఎవరుగెలిచారు? నిజం చెపితే, సంజీవిలాంటి మూలికలతో నీ విరిగిన కాలుకు కట్టుకట్టి, నడిచేలా చేస్తాను," అన్నాడు.

ఆ మాటలకు జలవృకుడు మూలుగుతూ జవాబివ్వబోయేంతలో, చెట్టు కొమ్మల్లోవుండి యిదంతా చూసిన జలవృకుడి తోటివాడు, రాతిగదను పైకెత్తి పట్టుకుని కేకలుపెడుతూ, "ఒరే, మాయా సరోవరేశ్వరుడి బంటూ! నిన్ని క్షణంలోనే, యీ లోకం నుంచి ప్రయాణం కట్టిస్తాను," అంటూ పరిగెత్తుకురాసాగాడు.



మంగళవర్మ మెరుపు వేగంతో తన ఊతకర్ర పిడిని పట్టుకుని పైకి గుంజాడు. లోపలినుంచి తళతళ మెరుస్తున్న పదునైన కత్తి బయిటికి వచ్చింది. అతడు, ఆ కత్తిని కాలువిరుచుకున్న జలవృక రాక్షసుడి కంఠం మీద పెట్టి. తనను సమీపిస్తున్న జలవృకుడితో, ''ఒరే, దుర్మార్గుడా! నేను ఒకటి నుంచి— మూడు అని పలికేలోపల నువు రాతి గదను దూరంగా పారేసి, మోకాళ్ళమీద పాకుతూ నన్ను సమీపించాలి. అలా చేయకపోయావో ముందు నీ నేస్తగాడి తల తెగిపోతుంది. తరవాత నీ వంతు! ఇదిగో, ఒకటి, రెండు....'' అన్నాడు.

మంగళవర్మ మూడు అనేలోపల జలవృకుడు రాతిగదను దూరంగా విసిరి, మోకాళ్ళనూ, చేతులనూ నేల మీద ఆనించి,'' లొంగిపోయాను. నా మిత్రుణ్ణి చంపకు!'' అన్నాడు వణికిపోతూ.

''ఒరే, నీటితోడేలు వెధవ్వయినా, నీ స్నేహధర్మం మెచ్చదగింది. నా వెంటరా నీకు ఓషధీపత్రాలు చూపుతాను,'' అంటూ మంగళవర్మ, దాపుల్లో చిత్త ఒత్తుగా పెరిగిన పొదలూ, చిన్నచిన్న మొక్కల్లోకి దారితీశాడు.

మంగళవర్మ జాగ్రత్తగా పరిశీలించి, అక్కడ కొన్ని పండుటాకులూ, చిగుళ్లూ కోసి, వాటిని అరచేతుల్లో మర్దించి, ఉండగా చేసి, దాన్ని జలవృకరాక్షసుడికి యిస్తూ, ''ఒరే, ఈ ఔషధాన్ని నీ మిత్రుడి మోకాలికి అంటించి, కట్టు కట్టు. వాడు ఉన్నచోటనే కనీసం పన్నెండు గంటల పాటు కదలకుండా వుండాలి. అలా చేయకపోయాడో, మోకాలు వరకూ తెగ నరకవలసి వస్తుంది.'' అన్నాడు.

ఆ మాటలకు జలవృకరాక్షసు లిద్దరూ ఏడ్పు ముఖాలు పెట్టారు. వాళ్ళు అరణ్యంలో ఏదో ముఖ్యమైన పనిమీదే తిరుగుతున్నారనీ, అడిగినా నిజం చెప్ప రనీ అనుకుంటూ మంగళవర్మ ముందుకు కదిలాడు. అతడు కొంతకాలంపాటు

మాయా సరోవరంలో నివసించినవాడు. అతడికి అక్కడికి వెళ్ళేందుకు దగ్గర దారి ఏదో తెలుసు. కాని, కొయ్యకాలుతో, ఎత్తు పల్లాలుగావున్న నేలమీద నడవటం అతడికి చాలా ప్రయాసగావున్నది.

మంగళవర్మ అలా కుంటుతూ, నాలు గైదు నిమిషాలకాలం నడిచేసరికి, అతడికి ఒక ఎత్తయిన చెట్టు మీది నుంచి, "మంగళవర్మా!" అన్న పిలుపు విని పించింది.

ఇదేరకం వృక్షపిశాచి, అనుకుంటూ మంగళవర్మ తల ఎత్తి చూశాడు. ఒక పెద్దచెట్టు చిటారు కొమ్మల మీద, అల్లి బిల్లిగావున్న అడవితీగలలో చిక్కుకుని, ఒక మనిషి అతడికి కనిపించాడు. వాడు మాయాసరోవరేశ్వరుడి హంసలరథంతోలే వాడు. ఆ రథం ఆకాశంలో తలకిందు లైనప్పుడు, వాడు దానిలోనుంచి జారి, ఆ చెట్టుపైగల అడవితీగల్లో చిక్కుకు పోయి, చావు తప్పుకున్నాడు.

'ఓహెూ, నువ్వు బతికే వున్నావన్న మాట! చాలా సంతోషం. కిందికి దిగి రావటానికి, దాపుల్లో ఏదైనా కొమ్మ ఊతం దొరకలేదా?" అన్నాడు మంగళవర్మ.

హంసలరథం తోలేవాడు అవునన్నట్టు తలవూపి, "వర్మా, కొంచెం మెల్లగా మాట్లాడు. యమకింకరుడిలాటి వాడొకడు భయంకరమైన నరవానరాన్ని ఎక్కి, యీ మార్గానే వస్తున్నాడు. అతడి వెంట కొందరు సైనికులుకూడా వున్నారు. వీళ్లు





మన శత్రువులైన జయశీలుడూ, సాధకుడూ అనుకుంటాను," అన్నాడు.

మంగళవర్మకు ఆ మాటలు వింటూనే ఉత్సాహం కలిగింది. ఆ వచ్చేవాళ్ళలో వైద్యదేవుడని పిలవబడే దేవశర్మ కూడా వుంటాడు. ఇప్పుడు వాళ్ళతో కలిసి, సాధ్యమైనంత త్వరగా మాయాసరోవరాన్ని చేరవచ్చు!

"ఒరే, బాబూ, యిప్పుడు వాళ్ళు మనకు శత్రువులు కారు; కాని మిత్రులవునో కాదో మాత్రం నాకు తెలియదు. మాయాసరోవరేశ్వరుడు, ఆ జయశీలుడనే అతన్ని పట్టుకుని, సరోవరం కేసి వెళ్లాడని తెలిసింది. ఇక యిప్పుడు నువు చెప్పే వీళ్ళలో మనవాడైన వైద్యదేవుడున్నాడు; నేను ఒంటికాలివాణ్ణి; చెట్టెక్కలేను. నువు దిగలేవు. ఆ వచ్చేవాళ్ళను చప్పట్లు చరిచి పిలువు," అన్నాడు మంగళవర్మ.

వైద్యదేవుడు, ఆ నరవారం ఎక్కివచ్చే వాడి వెంట వున్నాడని తెలియగానే రథం తోలేవాడికి ప్రాణం లేచి వచ్చింది. తను మరికొద్దికాలం అలా చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయివుంటే, ఏ నరభక్షకులో, జలవృకరాక్షసులో తనను హతమార్చి వుండేవాళ్లు!

రథం తోలేవాడు, తానున్న చెట్టుకు కొంచెం దూరంగా పోతున్న సిద్ధసాధకుడూ, రాజు కనకాక్షుడూ, అతడి వెంట వున్నవాళ్ళనూ ఉద్దేశించి, పెద్ద గొంతుతో, "అయ్యలారా, నన్ను రక్షించండి! ఇక్కడ చెట్టు చిటారు కొమ్మల్లోని, అడవితీగల్లో చిక్కుబడిపోయాను," అంటూ అరిచాడు.

అంతదూరం నుంచి వచ్చిన ఆ కేకను ముందుగా తన వాడి చెవులతో నరవానరం విన్నది. ఆ వెంటనే అది ఆగి, తల ఎత్తి చూస్తూ, భుజాలమీద వున్న సిద్ధసాధకుడికి సౌంజ్ఞ చేసింది. అంతలో రథం తోలేవాడు, మరొకసారి పెద్దగా కేక పెట్టాడు.

ఈ సారి వాడి కేకను అందరూ స్పష్టంగా విన్నారు. దేవశర్మ ముందుకు

వచ్చి, "ఆగొంతు మాయాసరోవరేశ్వరుడి రథం తోలేవాడిదిలా వున్నది. వాడు హంసలరథంలోంచి, యీ ప్రాంతాలే కింద పడిపోయాడు," అన్నాడు.

"ఆహాఁ, వాణ్ణి దొరకపుచ్చుకుని, వాడి యజమాని ఆ నీటిపక్షిగాడి రహస్యాలన్నీ బయిటికి లాగుతాను. జయశీలుడు కంటబడిం తరవాత, యీ గుంపునంతా చెట్లకు కట్టి, మహాకాలుడికి బలియిస్తాను," అంటూ సిద్ధసాధకుడు, నరవానరాన్ని గట్టిగా అదిలించాడు.

నరవానరం వేగంగా పరిగెత్తుతూ వచ్చి, రథం తోలేవాడున్న చెట్టు కింద ఆగింది. మంగళవర్మ సాధకుడి ముందుకు పోయి, "సాధకా, నువు చెట్లకొమ్మల్లో చిక్కుకుపోయిన మా వాణ్ణి కిందకు దించాలి. అదెలా సాధ్యం అంటావు?" అన్నాడు.

సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టి, "అంతా నాకు అయోమయంగా వున్నది. మాయాసరోవరేశ్వరుడనేవాడు, కనకాక్షరాజుగారి పిల్లల్ని అపహరించుకుపోవటమేగాక, ఇప్పుడు నా మిత్రుడైన జయశీలుణ్ణి కూడా పట్టుకుపోయాడు. ఆ దుర్మార్గుణ్ణి ఎరిగిన మీరేమో, వాణ్ణి మిత్రుడన్నట్టు మాట్లాడుతున్నారు," అన్నాడు.

దేవశర్మ, అతణ్ణి శాంతపరుస్తూ, "సాధకా, ఇప్పుడు మనకూ, ఆ మాయాసరోవరేశ్వరుడికీ—అందరికీ ప్రమాదకరమైన శత్రువులు, సరోవరంలోని మరొక



ప్రాంతాన నివసించే జలవృక రాక్షసులు. అందరం కలిసి వాళ్లను నాశనం చేస్తే తప్ప, కనకాక్షరాజుగారి పిల్లల్ని రక్షించే అవకాశం వుండదు. ఇప్పుడా సరోవరం జలవృకుల చేతుల్లో వుందని నా అనుమానం," అన్నాడు. అంతలో అక్కడికి కనకాక్షరాజు కొందరు సైనికులతో వచ్చాడు.

"అయ్యలారా, నా మాటేమిటి? పెద్ద కొండచిలువ ఒకటి, కొమ్మల మీద పాకుతూ, నా కేసి వస్తున్నది!" అంటూ రథం తోలేవాడు భీతితో పెద్దగా అరిచాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు, నరవానరం వీపు చరిచి, చేయెత్తి చూపుతూ, "ఆ చెట్టు కొమ్మల్లోని అడవి తీగల్లో చిక్కుకుపోయినవాణ్ణి, పోయి కిందికి తీసుకురా," అని ఆజ్ఞాపించాడు.

నరవానరం చప్పున కదిలి, మెరుపు వేగంతో చెట్టు చిటారు కొమ్మల్లోకి పోయి, ఒక చేత్తో రథం తోలేవాణ్ణి సమీపిస్తున్న కొండచిలువను పడిసి పట్టుకుని, రెండవ చేత్తో రథంవాణ్ణి, అడవి తీగలనుంచి బయిటికి లాగింది. వాడు, వానరాన్ని చూసి గడగడలాడిపోతూ, ఒక బలమైన కొమ్మ పట్టుకుని, "ఇక నన్ను వదులు, కిందికి దిగి రాగలను!" అన్నాడు.

అంతలో హఠాత్తుగా జలవృకరాక్షసుల గుంపొకటి రాతిగదలెత్తి, అక్కడికి పరిగెత్తుకునివస్తూ, "జై, జలవృక నాధుడికీ!" అంటూ వాళ్లమీద పడ్డారు.

జలరాక్షసుల్లో ఖడ్గమృగం మీద ఎక్కివున్న వాడొకడు రాతిగదను గిరగిరా తిప్పుతూ, "శత్రువుల్లో ఒక్కగానొక్కడైనా ప్రాణాలతో పారిపోగూడదు," అంటూ జలవృకుల్ని హెచ్చరించాడు.

చెట్టుకొమ్మల్లో వుండి యిది చూసిన నరవానరం, అరణ్యం దద్దరిల్లేలా ఒక కేకపెట్టి, చేతిలో చిక్కిన కొండచిలువను చర్నాకోలలా రపీమంటూ మోగించి, అంత ఎత్తునుంచి ఖడ్గమృగం ఎక్కివున్న జలరాక్షసుడి మీదికి సూటిగా దూకింది.

—(ముగింపు రాబోయే సంచికలో)






# సన్యాసి వరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పాత్రమెరిగి దానం చెయ్యాలంటారు. కాని ఒక్కొక్కసారి ఎంతో సత్పాత్రులైన వారికి కూడా దానాలు అచ్చిరావు. అందుకు నిదర్శనంగా నీకు మణిగుప్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం గొప్ప సిద్ధులుగల ఒక సన్యాసి, తన శిష్యుడితో సహా ఒక నగరానికి వచ్చాడు. ఆ నగరంలో మణిగుప్తు డనే గొప్ప ధనవంతుడుండే వాడు. ఆయనకు అపర దానకర్ణు డనే బిరుదు వుండేది. సన్యాసి ఆ మణిగుప్తుడి అతిథ్యం స్వీక రించటానికి వెళ్ళాడు.

## బేతాళ కథలు

మణిగుప్తుడి ఇంటి ముందు దానంస్వీక రించటానికి వేలాది దరిద్రులు నిలబడి ఉన్నారు. మణిగుప్తుడి మనుషులు ప్రతి ఒక్కరికీ డబ్బు ఇస్తున్నారు.

ఆ రోజు సన్యాసి ధనవంతుడి అతిథ్యం స్వీకరించి, ప్రయాణమై వెళ్ళిపోతూ, "నీ అతిథ్యాన్ని మెచ్చుకున్నాను. నీ దాతృత్వం కళ్ళారా చూశాను. నువు ఏదన్నా వరం కోరుకో ఇస్తాను. అయితే నువు కోరే వరం నిష్కల్మషంగా కోరినదైతేనే నెరవేరు తుంది," అన్నాడు.

మణిగుప్తుడు వినయంగా, "మహా ప్రసాదం!" అని, "నా జీవితాంతం ఇలాగే అవిరాళంగా దానధర్మాలు చెయ్యటానికి వీలుగా తరగని సంపద ఉండేటట్టు వరం ఇయ్యండి," అన్నాడు.

సన్యాసి చిరునవ్వు నవ్వి, తల ఆడించి, శిష్యుడితో సహా, బయలుదేరాడు.

దారిలో శిష్యుడు సన్యాసిని, "గురువు గారూ, ఆ మణిగుప్తుడికి మీ రిచ్చిన వరం దక్కేనా?" అని అడిగాడు.

"ఏమాత్రం దక్కదు!" అన్నాడు సన్యాసి.

తరవాత పరిస్థితులు అనుకూలించక, మణిగుప్తుడు తన సర్వస్వాన్నీ పోగొట్టు కుని, దానాలు చెయ్యటం మానాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సన్యాసి ఇచ్చిన వరం ఎందుకు ఫలించలేదు? అతనికి నిజంగా వరం ఇచ్చే శక్తిలేకనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మణిగుప్తుడు నిష్కల్మషంగా వరం కోరదలిస్తే తన నగరంలో దరిద్రులు లేకుండా చెయ్యమని సన్యాసిని కోరవలసింది. దాతగా తన కీర్తి, తన ధనమూ చిరస్థాయిగా ఉండాలన్నది, నిష్కల్మషమైన కోరిక కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నరబలి

శ్రీపురం నుంచి బయలుదేరిన చిన్నదు తన కుక్కతోసహా ఒక కొండప్రాంతంలో ప్రయాణం చేస్తూండగా, వాడికి ఒక వింత సంఘటన ఎదురయింది. కొందరు కొండ జాతివాళ్ళు డప్పులువాయిస్తూ, ఈలలు వేస్తూ, పెద్ద గుంపుగా వాడికి ఎదురు వచ్చారు. గుంపు మధ్య ఒక దున్నపోతుల బండి మీద ఒక మనిషిని ఒక నిలువు కర్రకు కట్టేసి, వాడికి పెద్దబొట్టు పెట్టి, మెడలో పూలదండవేసి, బలి ఇయ్యటానికి లాగా తీసుకుపోతున్నారు. వాడి ముఖంలో చావుభయం స్పష్టంగా కనిపిస్తున్నది. అడవి జాతుల వాళ్ల ఆచారాలు అమానుషంగా ఉంటాయని చిన్నడికి తెలుసు

చిన్నడు ఒకక్షణం ఆలోచించి, గుంపు వెనకగా నడుస్తున్న ఒక ముసలిదాన్ని పలకరించి, సంగతి ఏమిటని అడిగాడు.

ముసలిది ఒకపక్కగా ఉన్న గూడెం చూపించి, ''అదే మా గూడెం. ఈ కొండ చివరన పోలేరమ్మ ఉన్నది. ఆ తల్లి వెలిసి నాలుగేళ్లు అయింది. ఏటా తనకు ఒక మనిషినీ, ఒక జత దున్నపోతులనూ బలి ఇయ్యవలసిందిగా ఆమె ఆజ్ఞ అయింది. ఆ తల్లి మహిమగల తల్లి! కిందటేడు మనిషిని బలిపెట్టకపోయే సరికి వానలు పడక, పంటలు పండక, జనం చచ్చిపోయారు. మేకపోతును బలి ఇస్తానని మొక్కుకున్న జోగులుగాడు, మాట తప్పినందుకు రక్తం కక్కుకుని చచ్చాడు. భైరవుడే స్వయంగా నరబలి చేస్తాడు, నువు కూడా చూద్దువుగాని రా!'' అన్నది.

చిన్నడు ఆమెతో, ''ఆ మనిషికి తల్లీ, తండ్రీ ఎవరూ లేరా? వాణ్ణి నిలువునా బలి ఇస్తే ఏడ్చేవాళ్ళు లేరా?'' అన్నాడు.

బూర్లె నాగేశ్వరరావు

"భలేవాడివే! ఎందుకేడుస్తారు? వాడు నా కొడుకే. వాడికేం? పోలేరమ్మ తల్లి వాణ్ణి తిన్నగా స్వర్గానికి పంపిస్తుంది," అన్నది ముసలిది.

చిన్నడికి నవ్వాలో, ఏడవాలో తెలీ లేదు. వాళ్లు పట్టి మూర్ఖులు. కన్నతల్లే వాణ్ణి బలి చెయ్యటానికి పంపుతున్నది! ఎలాగైనా వాళ్ళను ఈ మార్గం నుంచి తప్పించాలి, ఎలా?

చిన్నడికి ఒక మెరుపులాటి ఆలోచన వచ్చింది. వాడు ఊరేగింపును సాగి పోనిచ్చి, గూడెం కేసి పరిగెత్తాడు. అక్కడ ఒక్కపురుగైనా లేదు. చిన్నడు తిన్నగా ఒక గుడిసెకు నిప్పు అంటించి, మళ్ళీ వచ్చి గుంపులో చేరుకున్నాడు.

అందరూ పోలేరమ్మను చేరవచ్చారు. పోలేరమ్మ విగ్రహం మిడిగుడ్లతో భయంకరంగా ఉన్నది. అందరూ విగ్రహం చుట్టూ ప్రదక్షిణం చేసి బండి మీద తెచ్చిన మనిషిని విగ్రహం ముందుకు తెచ్చారు. వికృతరూపంలో ఉన్న ఒక భైరవుడు కత్తి ఎత్తి పట్టుకుని, కళ్ళు మూసుకుని, ఏవో మంత్రాలు చదవ సాగాడు.

చిన్నడు తన కుక్కకేదో సైగచేశాడు. వెంటనే అది భైరవుడి మీదికి ఎగసి దూకి, వాడి మణికట్టు నోట కరుచుకుని, వాణ్ణి వెనక్కులాగింది. క్షణంపాటు, భైరవుడితో బాటు అక్కడ గుమిగూడిన వాళ్ళందరూ బిత్తరపోయారు.



''ఏదో అపరాధం జరిగి ఉంటుంది,'' అన్నాడు భైరవుడు.

వెంటనే చిన్నడు వాడితో, ''సరిగా గ్రహించావు. ఆ అపరాధం ఏమిటో నేను చెబుతా, విను,'' అంటూ ఇలా చెప్పాడు:

''మాది ముత్యాలపురం. పోలేరమ్మా, మారెమ్మా, మైసమ్మా, వీళ్ళంతా పుట్టింది మా ఊళ్ళోనే. అందరిలోనూ గొప్పది పోలేరమ్మ. ఇంతదాకా ఆవిడకు ఏటా నూట ఒక్క మందిని బలి ఇస్తూండే వాళ్లం. కాని, ఈ ఏడు బలి చేయటానికి సిద్ధం చేసిన నూట ఒక్క మందిలో ఒక బ్రాహ్మడు ఉన్నాడు. బలి చేయబోతూండగా ఆ బ్రాహ్మడు కాలభైరవుడితో, 'గత రాత్రి పోలేరమ్మకూ, నాకూ పెళ్లి అయింది. ఆమె ఇప్పుడు ఉత్తమ జాతికి చెందిన బ్రాహ్మణస్త్రీ. కాబట్టి ఆమె మాంసం ముట్టదు. ఇక మీదట మీరు ఈ బలులను ఆపెయ్యాలి. లేకపోతే అనుభవిస్తారు,' అన్నాడు.

''దానికి మా కాలభైరవుడు పకపకా నవ్వి, 'నీ కేదో చావు తెలివిపుట్టింది. పోలేరమ్మ నిన్ను పెళ్ళాడిందా? మాంసంతినటం మానేసిందా? అయితే నీ ముందే ఆమె చేత మాంసం తినిపిస్తా, చూడు!' అంటూ ఒక మనిషిని బలి చేశాడు. రక్తం చిమ్మి, భైరవుడి కంటిలో పడింది. ఆకాశంలో మెరుపులు మెరిశాయి. భూమి దద్దరిల్లింది. అంతే! కాలభైరవుడు కుక్కగా మారిపోయాడు.



ఆకాశం నుంచి నిప్పులుకురిసి, ఊరంతా కాలిపోయింది. ఎలాగైనా కాలభైరవుడికి ఈ కుక్కరూపం పోగొట్టాలని, వెంట బెట్టుకుని తీర్థయాత్రలు చేస్తూ ఇటుగా వచ్చాను.''

భైరవుడు కుక్కనూ, చిన్నణ్ణీ మార్చి మార్చి చూశాడు.

చిన్నడు వాడితో, ''చూడు, భైరవా. బలి చేయవద్దని నేను నిన్ను నిర్బంధించటం లేదు. తనతోటి వాడివన్న అభిమానం కొద్దీ మా భైరవుడు కుక్క రూపంలో ఉండి కూడా, నిన్ను రక్షించటానికి ప్రయత్నం చేశాడు. ఎందుకంటే, పోలేరమ్మ సామాన్యురాలు కాదు. ఆ మాట నీకూ తెలుసు. ఆమె చిన్నప్పుడే పెళ్ళిలో తన మొగుణ్ణి మింగిందట! అందుకే గదా ఇప్పటిదాకా పురుషులనే నరబలి కోరుతూవచ్చింది?'' అన్నాడు.

అంతలో కొందరు పరిగెత్తుకుంటూ వచ్చి, గూడెం అంటుకుందని చెప్పారు. చాలా మంది గూడెం కేసి పరిగెత్తారు. చిన్నడు చెప్పిన దానికీ, జరిగిన దానికీ సరిపోయింది. అందరికీ చిన్నడి మాటల్లో గురికుదిరింది.

భైరవుడు కత్తి దూరంగా విసిరేసి, కుక్క కాళ్ళమీదపడి, ''కాలభైరవా, నీ మేలు జన్మ జన్మలకీ మరిచిపోను. కుక్కరూపం రాకుండా నన్ను రక్షించావు. చాలు! ఇక మీద ఆ తల్లికి కొబ్బరికాయలూ, గుమ్మడికాయలూ మాత్రమే బలి ఇస్తాను. నేను కూడా మాంసం ముట్టను.'' అంటూ ప్రమాణం చేశాడు.

తరవాత చిన్నడితో సహా అందరూ గూడెం చేరారు. ఎక్కువ నష్టం జరగ లేదు. రెండు గుడిసెలు మాత్రమే కాలిపోయాయి. కాలిన గుడిసెలు తిరిగి కట్టుకో వచ్చు, కాని పోయినప్రాణం తిరిగి రాదు. అందుచేత తాను చేసినపనికి చిన్నడు ఆటే పశ్చాత్తాప పడలేదు.

వాడు మళ్ళీ తన కుక్కతో సహా ఆ ప్రాంతం వదిలి ముందుకు సాగిపోయాడు.





రామయ్య అనే చిన్నరైతు చనిపోతూ తన ఇంటినీ, నాలుగెకరాల భూమినీ తన ఇద్దరు కొడుకులకూ సమంగా పంచాడు. పోయేముందు రామయ్య తన చిన్న కొడుకుతో, "నాయనా, నీకేది కావాలన్నా అన్నను అడుగు. కష్టకాలం వచ్చినప్పుడు నీ పొలంలో ఈశాన్యదిశలో బావి తవ్వుకో," అని సలహా ఇచ్చాడు.

రామయ్య పెద్దకొడుకు రంగడు మంచి వాడూ, పనిమంతుడూనూ. రెండోవాడు సోముడు దేనికీ సమర్థత లేనివాడూ, సోమరిపోతూనూ.

తొలకరి రాగానే రంగడు తన వంతు పొలంలో పనులు ప్రారంభించాడు. సోముడు అన్న సలహాలను పెడచెవిని బెట్టి, పొలంపనులు చెయ్యక, తిని తిరుగుతూ వచ్చాడు. రంగడు విసిగి ఊరుకున్నాడు.

రోజులు గడుస్తున్నాయి. రంగడి పొలం పచ్చగా, చూడముచ్చటగా ఉన్నది. సోముడి పొలం బీడుపడి ఉన్నది. సోముడికి అన్న పొలం చూసి కన్ను కుట్టింది.

వాడు రంగడితో, "అన్నయ్యా, నీమాట విననందుకు చాలా బాధపడుతున్నాను. నాకు వ్యవసాయం పనులు చాతకాదని నీకు తెలుసుగదా! నా పొలం బీడుపడి ఉన్నది. దాన్ని కాస్త సాగుచేసిపెట్టు," అన్నాడు.

దానికి రంగడు సరేనని, తమ్ముడి పొలం దున్నసాగాడు.

రెండు రోజులు ఆగి సోముడు, "అన్నయ్యా, నా పొలం నువు తీసుకుని, నీ పొలం నాకియ్యి. మిగతా పనులు ఏదో విధంగా నేను చేసుకుంటాను," అన్నాడు అన్నతో.

బొమ్మిడి అచ్చారావు

దానికి కూడా రంగడు సరేనన్నాడు. రంగడూ, సోముడూ తమ పొలాలు మార్చుకున్నారు. రంగడు తీసుకున్న సోముడి పొలానికి నీటి సౌకర్యం లేదు. రంగడి భాగంలో బావి ఉన్నది గాని, దాని నీరు సోముడి వాటాకు ఎక్కదు. అందుకే తండ్రి సోముడికి బావి తవ్వుకోమని సలహా యిచ్చాడు. సోముడికి వ్యవసాయం పనులలో ఆసక్తి లేదని తెలిసే ఆయన వాడికి మెరకభూమి ఇచ్చాడు.

రంగడు తండ్రి సలహా ప్రకారం ఆ మెరక పొలం ఈశాన్యాన బావి తవ్వటానికి ఉపక్రమించాడు. రెండు గజాల లోతు తవ్వేసరికి ఒక పాత్ర దొరికింది. దానిమూతి గట్టిగా బిగించి ఉన్నది. రంగడు ఆశ్చర్యపడి దానిమూత తీసి చూస్తే, అందులో డబ్బు ఉన్నది. అది తన తండ్రి జీవజ్జీవం కూడబెట్టిన డబ్బు అనీ, ఏమీ చేతగాని సోముడికి అది అయినా దక్కాలనే ఉద్దేశంతోనే తండ్రి వాడికి ఆ మెరకభూమి ఇయ్యటమూ ఫలానాచోట బావి తవ్వుకోమని చెప్పటమూ జరిగిందనీ రంగడు గ్రహించాడు.

రంగడు పొలం పనులలో సమర్థుడు గనక అతని కోసం తండ్రి ప్రత్యేక సదుపాయా లేమీ చేయలేదు.

తండ్రి ఆశయం సిద్ధించగలందులకు రంగడు ఆ ధనాన్ని సోముడికి ఇయ్య నిశ్చయించి, సాయంకాలం దాన్ని ఇంటికి తీసుకుపోయాడు. అయితే అతను అనుకున్నట్టు జరగలేదు.

రంగడు పొలాన బావి తవ్వుతున్న సమయంలో సోముడు తన వంతు ఇంటినీ, తన అన్న నుంచి తీసుకున్న పంటపొలాన్నీ ఎవరికో అమ్మేసి, ఆ డబ్బుతో ఎటో వెళ్ళిపోయాడు. పొలం పనులన్నీ తన అన్న చేసిపెట్టినా, పంట కోసి ఇంటికి తెచ్చుకునే పాటి సామర్థ్యం కూడా సోముడికి లేదు.

తన తమ్ముడి అదృష్టహీనతకు రంగడు జాలిపడ్డాడు.





# సీతాసాగరం

మోతీపుర జమీందారు రూపరాం భార్య లక్ష్మి గొప్ప పవిత్రురాలు. ఆమె ఒక కొడుకును కని, ఒక పర్వదినంనాడు, శుభ ఘడియలో మరణించింది. ఆమె పట్ల ఎంతో అనురాగం గల జమీందారు ఆమె పేర ఒక చెరువు తవ్వించి, దానికి లక్ష్మిసాగరం అని పేరు పెట్టాడు. ఆమె మరణించినప్పుడు ఆమె శరీరానికి లక్ష్మి సాగరం ఒడ్డునే దహనక్రియ జరిగింది. అటు తరవాత ఊరివాళ్ళు లక్ష్మి పోయిన రోజున ప్రతి ఏడూ లక్ష్మిసాగరంలో స్నానాలు చేసి, ఉత్సవం జరుపుతూ వచ్చారు.

జమీందారు కొంతకాలంపాటు తిరిగి వివాహం చేసుకోలేదు. కాని కొంతకాలం గడిచినాక అతను మరొక జమీందారు ఆహ్వానంపై అతని అతిథిగా వెళ్ళి, అతని కుమార్తె అయిన సీతను చూశాడు. సీత చక్కనిది, విద్యాంసురాలు. అందుచేత సీత తండ్రి ఆమెను తనకిచ్చి పెళ్లిచేస్తా నన్నప్పుడు రూపరాం సమ్మతించాడు.

సీత కాపరానికి వచ్చినప్పుడు దివాణంలో ప్రతి ఒక్కరూ ఆమె సౌజ న్యానికి ముగ్ధులయారు. ఆమె తన సవతి కొడుకును సొంత కొడుకులాగా చూసు కున్నది. రూపరాం పరమానంద భరితుడై, సీత పేర మరొక చెరువు తవ్వించి, దానికి సీతాసాగరం అని పేరు పెట్టాడు. అయితే ప్రజలు లక్ష్మిసాగరాన్ని పవిత్రంగా చూసినట్టుగా సీతాసాగరాన్ని చూడలేదు.

సీత తన గదిలో గవాక్షం వద్ద కూర్చుని సీతాసాగరాన్ని చూసినప్పుడు, సహజంగా ఎంత విశాలమైన హృదయం గల మనిషి అయినప్పటికీ, తన సవతి పట్ల కొంచెం ఈర్ష్యపడేది.

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు



ఒకసారి జమీందారు ఆమెతో, "సీతా, నువు అన్నివిధాలా ధన్యురాలివి సుమా!" అన్నప్పుడు ఆమె నిట్టూర్చి, "నేను లక్ష్మిలాగా ధన్యురాలిని కావాలంటే, ఒక పర్వదినం నాడు శుభ ఘడియలో చచ్చి, సీతాసాగరం ఒడ్డున దహనం కావాలి!" అన్నది.

ఆమె ఆ మాట అన్నమీదట రూపరాం, తన భార్య రహస్యవేదనను గ్రహించి, ఆమెకు తృప్తి కలిగేటందుకు ఏదైనా చెయ్యాలని తీర్మానించుకున్నాడు.

దివాణంలో సోమనాథు డనే ఐంద్రజాలికుడు ఉన్నాడు. రూపరాంకు అతనితో ఆ బాల్య స్నేహం ఉన్నది. సోమనాథుడి దగ్గిర అతనికి రహస్యాలు లేవు. అనేకసార్లు రూపరాం సమస్యలకు సోమనాథుడు పరిష్కారమార్గాలు చెప్పి ఉన్నాడు.

రూపరాం సీతతో, "సీతాసాగరం ఒడ్డున ఒక దేవాలయం కట్టిస్తాను. అప్పుడు సీతాసాగరం కూడా లక్ష్మిసాగరం లాగే ప్రజలకు పవిత్రమవుతుంది." అన్నాడు.

"లక్ష్మిసాగరానికి స్వతహాగా పవిత్రత ఉన్నది. సీతాసాగరానికి పవిత్రత చేకూరితే అది దేవాలయానిదే అవుతుంది గాని, నిజంగా సీతాసాగరానిది ఎలా అవుతుంది? పైపెచ్చు నేను గొడ్రాలిని కూడానూ!" అన్నది సీత.

"ఆ ఆలయం నీ పేరనే కట్టిస్తున్నాను. అది శివాలయం. ఎవరు చూశారు? శివానుగ్రహం వల్ల నీకు పిల్లలు కలగ వచ్చు." అన్నాడు జమీందారు.

త్వరలోనే సీతాసాగరం ఒడ్డున చలవ రాతితో శివాలయం లేచింది. దేవుడికి ప్రాణప్రతిష్ఠ జరగవలసి ఉన్నది. ఈ సమయంలోనే సీత గర్భవతిగా ఉన్న సంగతి బయటపడింది.

ఈ వార్త విని సోమనాథుడు రూపరాంతో, "ఇది సీతకు చాలా సంతోషం కలిగిస్తుంది. కాని ఆమె ఆనందం పూర్తి

కావాలంటే, లక్ష్మిసాగరానికి ఉన్న పవిత్రత సీతాసాగరానికి కూడా రావాలి. అప్పుడు గాని ఆమె విచారం పూర్తిగా తొలగదు,'' అన్నాడు.

దానికి రూపరాం, ''అది నా చేతిలో లేదు. సీతాసాగరాన్ని కూడా భక్తితో చూడమని నేను ప్రజలకు ఎలా చెప్పను? లక్ష్మి పర్వదినాన ముత్తయిదువు చావు చచ్చిన కారణంగా ప్రజలు లక్ష్మి సాగరాన్ని పవిత్రంగా ఎంచుతున్నారు,'' అన్నాడు.

''నువు సహకరిస్తే, నువు చెయ్యలే నంటున్న పని నేను చేస్తాను. ప్రాణ ప్రతిష్ఠకు విగ్రహాన్ని బహిరంగంగా తీసుకురావద్దు. అది మన గ్రామంలో తెలిసినట్టు నాటకం ఆడాలి,'' అంటూ సోమనాధుడు రూపరాంకు ఏదో చెప్పాడు.

మర్నాడు ఒక వార్త ప్రచారమయింది. దాని సారాంశమేమంటే, రూపరాంకు ఒక కల వచ్చిందట. దేవాలయంలో ప్రతిష్ఠించవలసిన విగ్రహం గ్రామంలోనే ఎక్కడో వెలుస్తుందనీ, దానికోసం ఇతర యత్నాలేవీ చేయనవసరంలేదనీ, విగ్రహం ఎక్కడ వెలిసేదీ కాలక్రమాన తెలిసి పోతుందనీ కలలో తెలియవచ్చిందట.

రేపు ఉదయం ప్రాణప్రతిష్ఠకు ముహూర్తం అనగా దివాణం నుంచి ఒక వార్త వెలువడింది. విగ్రహం ఒకానొక చెరువులో లభిస్తుంది. ఏ చెరువులో అది లభించేదీ తెలుసుకోవటానికి అన్ని



చెరువుల నీటి రంగునూ పరీక్షించాలి. ఈ పరీక్ష దేవాలయం మందిరంలో ఆ రోజు సాయంకాలం జరుగుతుంది. అన్ని చెరువుల నీళ్ళనూ కుండలలో తేవాలి. దైవాదేశం ప్రకారం జమీందారు గారు పరీక్ష జరుపుతారు.

ఆ సాయంకాలం దేవాలయ ప్రాంగణంలో ఊరి ప్రజలూ, పొరుగూళ్ళ వాళ్ళూ హాజరయారు. వేరు వేరు చెరువుల నీళ్లు వేరు వేరు కుండలలో వచ్చాయి. రూపరాం చేతిలో ఒక గాజు గ్లాసు తీసుకుని, అందులో ఒక్కొక్క చెరువు నీరే నింపి, ఎత్తి పట్టుకుని, దేవుడి పేరు జపించాడు. ఇలా రాణీసాగరం, పద్మసరోవరం, దేపిపుష్కరం, లక్ష్మిసాగరం వగైరాల జలాన్ని గ్లాసులో ఎత్తి పట్టుకుంటే నీటి రంగు మారింది కాదు. కాని సీతాసాగరం నీరు గ్లాసులో పోసి, జమీందారు తన కుడిచేతిలో ఎత్తి పట్టుకోగానే దాని రంగు ఊదాగా మారింది. మహిమ ప్రదర్శించబడింది!

తరవాత సీతాసాగరం నాలుగు మూలలా వెతకగా ఆలయానికి కావలసిన విగ్రహం దొరికింది. దాన్ని ఊరేగింపుతో తీసుకువచ్చి, మర్నాడు ఆలయంలో ప్రతిష్ఠ చేశారు.

తరవాత సీతాసాగరానికి కూడా పవిత్రత లభించింది. అక్కడ కూడా ఏటా ఉత్సవాలు జరిగాయి.

నీటికి రంగు వచ్చే ఏర్పాటు చేసిన వాడు సోమనాథుడు. ఒక సన్నని నల్ల దారం తీసుకుని, ధానికి పొటాసియం పర్మాంగనేట్ పొడి అంటించి, జమీందారు ఎత్తిన చేతికి అందుబాటులో దాని చివర వేళ్ళాడేటట్టుగా అమర్చాడు. జమీందారు సీతాసాగరం నీరు నింపిన గ్లాసును పైకి ఎత్తేటప్పుడు ఆ దారం చివరి భాగం నీటిలో పడేలాగ ఎత్తి పట్టుకున్నాడు. ఆ దారంతోనే, గ్లాసులో వున్న నీటి రంగు మారింది.

కాలక్రమాన సీత ఒక చక్కని కూతుర్ని కన్నది.






కాంచీపురంలో ధనగుప్తుడు అనే రత్నాల వ్యాపారి ఉండేవాడు. అతనికి ఖరీదైన ఓడ ఒకటి ఉండేది. దానిలో అతను రత్నాల వ్యాపారం చేసేవాడు; విదేశాలలో తక్కువ ధరకు రత్నాలు కొని, తన దేశంలో మంచి ధరకు అమ్ముతూ, రత్నగుప్తుడు లక్షలకు లక్షలు సంపాదించాడు.

ధనగుప్తుడికి పద్మకళ అనే కుమార్తె ఉండేది. ఆమె తల్లి చిన్నతనంలోనే చనిపోతే, తండ్రి ఆమెను ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేశాడు. ఆమెను తనలాటి లక్షాధికారికే ఇచ్చి పెళ్ళి చెయ్యాలని ఆలోచించాడు ధనగుప్తుడు.

అయితే పద్మకళ విద్యాగుప్తుడు అనే యువకుణ్ణి ప్రేమించింది. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. ఈ సంగతి తెలియక ధనగుప్తుడు తన కుమార్తెకు సంబంధాలు చూడసాగాడు.

తన తండ్రి తన కోసం వరులను చూస్తున్నాడని తెలియగానే పద్మకళ విద్యాగుప్తుడికి ఆ సంగతి చెప్పి, "వెంటనే నువు మా నాన్నను కలుసుకుని, మన ప్రేమవ్యవహారం చెప్పి, నన్ను నీ కిచ్చి పెళ్లిచేయమని అడుగు,'' అన్నది.

విద్యాగుప్తుడు సరేనని, మర్నాడు ధనగుప్తుడు ఒంటరిగా ఉన్న సమయంలో, తానూ, పద్మకళా ప్రేమించుకుని, పెళ్లాడ గోరుతున్నట్టు చెప్పాడు.

ధనగుప్తుడు విద్యాగుప్తుడు చెప్పిన మాట నమ్మలేక, లోపలికి వెళ్ళి తన కుమార్తెను అడిగాడు.

'' విద్యాగుప్తుడు చెప్పినమాట నిజమే. నేను అతన్ని తప్ప మరొకరిని పెళ్లి చేసుకోను,'' అని పద్మకళ తండ్రితో అన్నది.

విద్యాగుప్తుడు ఎలాటివాడో తెలియకుండా అతని చేతిలో తన కుమార్తెను

పి. వి. యస్సెస్సెన్‌రాజు

పెట్టటానికి ధనగుప్తుడి మనసు ఒప్పుకో లేదు. ఆ మాట అని, కూతురి నిర్ణయాన్ని వ్యతిరేకించటమూ అతనికి సాధ్యం కాలేదు. అందుచేత ధనగుప్తుడు విద్యా గుప్తుడి వద్దకు తిరిగివచ్చి, ''చూడు, బాబూ. రెండురోజులలో మా బంధు వొకాయన రాబోతున్నాడు. ఆయనతో సంప్రతించి నీకు సమాధానం చెబుతాను. అంతదాకా నువు మా ఇంటనే ఉండు,'' అన్నాడు. విద్యాగుప్తుడు సరేనన్నాడు.

ధనగుప్తుడి బంధువు రాలేదుగాని, రెండో రోజు ధనగుప్తుడికి ఒక దుర్వార్త మాత్రం అందింది. అదేమంటే, దేశాంత రాలనుంచి రత్నాలు తెస్తున్న ధనగుప్తుడి ఓడ సముద్ర మధ్యంలో మునిగిపోయింది!

ఈ వార్త విని ధనగుప్తుడు చాలా బాధపడ్డాడు. ఆ కీడు తన కారణంగానే వచ్చిందని ధనగుప్తుడు అనుకుని పోతాడని విద్యాగుప్తుడికి భయం వేసింది. ఈ వార్త క్షణంలో పాకి, ధనగుప్తుడికి మదుపు పెట్టిన వాళ్ళు, అతని ఆస్తి స్వాధీనం చేసుకునేటందుకు తొందరపడ్డారు. ధన గుప్తుడు కుంగిపోయాడు.

అది చూసి విద్యాగుప్తుడు, ''మామ గారూ, విచారించకండి. మిమ్మల్ని ఏ విధంగానైనా పోషించగల శక్తి నాకు ఉన్నది. ఇదంతా మా ప్రేమకు భగ వంతుడు పెట్టిన పరీక్ష లాగున్నది. మీరు నాతో వచ్చెయ్యండి,'' అన్నాడు.

ధనగుప్తుడి ముఖంలో విచారం మాయమై, ఆనందం కనబడింది.

''ఇది భగవంతుడి పరీక్ష కాదు, నాయనా. నీ స్వభావం తెలుసుకునే టందుకు నేను ఆడిన నాటకం. నువు మా అమ్మాయినే కోరావో, నా ఆస్తినే కోరావో తెలుసుకోవలసిన అవసరం నాకు కలిగింది. నా పరీక్షలో నెగ్గావు,'' అన్నాడు ధనగుప్తుడు.

త్వరలోనే విద్యాగుప్తుడికీ, పద్మకళకూ వివాహం జరిగింది. ధనగుప్తుడు తన వ్యాపారమంతా అల్లుడికి అప్పగించి, తాను విశ్రాంతి తీసుకున్నాడు.





# సారంగుడి వైరాగ్యం

సుందర్భదేశంలో అన్నిరకాల దురాచారాలూ ఉండేవి. అంటరానితనం ఉండేది. పంచములను ఊరికి దూరంగా ఉంచేవాళ్ళు. ఆడపిల్లలకు కట్నాలు పోస్తేగాని పెళ్ళిళ్ళు అయేవికావు. అధికార్లు లంచాలు మరిగారు. ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ కూడా తాగుడుమరిగి, డబ్బు తగలేసుకుని, ఆరోగ్యాన్ని కూడా కోల్పోయేవారు.

సుదర్భదేశంలో సారంగుడనే మహాత్ముడు ఉండేవాడు. దేశంలో దురాచారాలు పోగొట్టాలంటే ప్రజలలో హెచ్చుగా ఉన్న నిరక్షరత నిర్మూలించాలని తీర్మానించుకుని, అక్షరాస్యత పెంచడానికీ, దురాచారాల నిర్మూలనకూ పెద్ద ఎత్తున ఉద్యమం లేవదీశాడు. తన ఉద్యమాన్ని చాలా మంది వ్యతిరేకించినా ఆయన లక్ష్యపెట్టలేదు. యువకులు అధికసంఖ్యలో ఆయనను బలపరిచారు. రాజు ఆ ఉద్యమాన్ని అణచటానికి యత్నించాడు. సైనికులు కూడా ప్రజలతో చేరిపోయి, రాజును పడగొట్టారు. సారంగుడే దేశానికి రాజుకావాలని ప్రజలు ఏక కంఠంగా కోరారు.

అయితే సారంగుడికి రాజ్యకాంక్షలేదు. అతను తన అనుచరులలో ముఖ్యుడైన చరితార్థుడు అనేవాణ్ణి రాజుగా చేసి, ప్రజలలో ఎలాటి దురాచారాలు తల ఎత్తకుండా చూసుకోవాలో చెప్పి, తపస్సు చేసుకుంటానని అడవులకు వెళ్ళిపోయాడు. ఆయన అడవులలో ఆశ్రమం కల్పించుకుని, పదిహేనేళ్ళు గడిపినాక, సుదర్భ దేశం ఇప్పుడెలా ఉన్నదో తెలుసుకోవాలనిపించింది.

సారంగడు చరితార్థుడి వద్దకు ఒక శిష్యుణ్ణి పంపి, తనకు దేశపరిస్థి

"వసుంధర"

చూడాలని ఉన్నట్టు కబురు చేశాడు. ఈ కబురు అందగానే చరితార్థుడు ఒక రథం మీద తానే సారంగుణ్ణి చూడ వచ్చాడు. సారంగుడు తన ఆశ్రమాన్ని శిష్యులకు అప్పగించి, చరితార్థుడి వెంట రథంలో వెళ్ళాడు.

సుదర్భదేశంలో సారంగుడికి గొప్ప స్వాగతంలభించింది. సారంగడు పర్యటన చేసేటప్పుడు చరితార్థుడు ఆయన వెంట ఉన్నాడు. సారంగడు కారాగారానికి వెళ్ళి అక్కడఉన్న ఖైదీలను చూసి, వివరాలు అడిగాడు. వారిలో కట్నాలు తీసుకున్నవారూ, తాగినవాళ్ళూ, లంచం తీసుకున్న ఉద్యోగులూ, ఇతర నేరాలు చేసినవాళ్ళూ ఉన్నారు.

"రాజభటులు వెయ్యికళ్లతో నేరస్థులను పట్టుకుంటున్నారు. అందుచేత నేరాలు చేసి, శిక్షపడకుండా తప్పించుకోవటం కష్టమైపోతున్నది,'' అన్నాడు చరితార్థుడు.

''వీళ్ళు ఎంతకాలంగా కారాగృహంలో ఉన్నారు? '' అని సారంగుడు అడిగాడు.

''మీ ఆశయాలను దృష్టిలో పెట్టుకుని శిక్షలు మరీకఠినంగా ఉండకుండా చూస్తున్నాం. ఇలాటి నేరాలకు ఆరు మాసాలు మించి శిక్ష ఉండదు. వీళ్ళు ఇక్కడికి వచ్చి వారంరోజులు అవుతుందనుకుంటాను,'' అన్నాడు చరితార్థుడు.

సారంగుడు ఉలిక్కిపడి, ''ఇంక ఇక్కడి నుంచి వెళ్ళిపోదాం,'' అన్నాడు.



ఆ తర్వాత ఇద్దరూ ఒక కల్యాణ భవనంలోకి వెళ్ళారు.

"కులాంతరవివాహాలు చేసుకునేవారికే ఈ భవనంలో సదుపాయాలుంటాయి. వర్ణాంతరవివాహాలను ప్రోత్సహించటానికి ఈభవనం నిర్మించాం. ఇప్పటికి ఇందులో వందకు పైగా పెళ్ళిళ్ళు జరిగాయి. ప్రతి వివాహానికీ వెయ్యివరహాలు . బహుమతి ఇస్తూంటాను. పదిరోజులక్రితమే ఇందులో ఆఖరి పెళ్ళి జరిగింది....''

ఇలా చరితార్థుడు ఉత్సాహంగా ఒకటొకటే చెప్పుకుపోతుంటే, సారంగదు కళ్ళు తుడుచుకున్నాడు. అవి ఆనంద బాష్పాలు కాబోలుననుకున్నాడు చరితార్థుడు.

అక్కడినుంచి ఇద్దరూ క్రీడాస్థలాలకు వెళ్లారు. అక్కడ ఎందరో ఆడుతున్నారు.

''మహాత్మా, చూశారా, మీరు కోరిన మార్పు ఈ దేశంలో ఎంత త్వరగా వచ్చిందో!'' అన్నాడు చరితార్థుడు.

''ఏమిటా మార్పు?'' అని సారంగుడు అడిగాడు.

''ఇక్కడ ఆడుకునే వారిలో అగ్ర వర్ణులతోబాటు పంచములు కూడా ఉన్నారు,''' అన్నాడు చరితార్థుడు.

''వీరిలో పంచములున్నారని నీకు ఎలా తెలుసు?'' అని సారంగుడు అడిగాడు, ఆశ్చర్యపోయి.

''ఇక్కడ సవర్ణులూ, పంచములూ ఆడుకోవాలి. అందుకే ఈ స్థలం ఏర్పాటు



చేసి, అంటరానితనాన్ని నిర్మూలిస్తున్నాం. తేడా తెలీటంకోసం అగ్రవర్ణులు నీలం రంగు దుస్తులూ, పంచములు పచ్చ దుస్తులూధరించి, కలిసి ఆడుకుంటారు," అన్నాడు చరితార్థుడు.

ఆ మాటలు వింటూనే సారంగుడి కళ్లు నీళ్లుకమ్మి, ఎటు చూసినా ఆయనకు ఏమీ కనబడలేదు.

''రేపు మనం దేశపర్యటన ఆరంభింతాం.'' అన్నాడు చరితార్థుడు.

''చూసినది చాలు. నాలో పర్యటన చెయ్యాలన్న కోరిక నశించింది. నా తిరుగు ప్రయాణానికి ఏర్పాటు చెయ్యి.'' అన్నాడు సారంగుడు.

''అదేమిటి, స్వామీ?'' అన్నాడు చరితార్థుడు ఆశ్చర్యంగా.

''దేశంలో పంచములనే మాట వినబడరాదనుకున్నాను. అంటరాని తనం ప్రజలకు ఇంకా తెలియటమూ, వారితో కలిసి తిరగటం ఇంకా గొప్పగా భావించబడటమూ జరుగుతున్నది! వర్ణాంతర వివాహాలకు ప్రభుత్వం బహుమతులిస్తున్నదంటే, ప్రజలు అలాటి వివాహాలను ఇంకా ప్రారంభించలేదన్న మాట! కట్నాలూ, తాగుడూ, లంచగొండితనమూ ప్రజలలో ఇంకాపోలేదు. అందుచేత వారికి శిక్షలు పడుతున్నాయి. రాజువైననువు ఈమాత్రం గ్రహించక ఏదో సాధించాననుకుని గర్వపడుతున్నావు! దురాచారాలు చట్టాలతో పోవు. ప్రజల మనస్సుల్లో పరివర్తన తీసుకు రావాలి. నా శిక్షణలో ప్రజానాయకుడివైన నీ పరిపాలనలో పరిస్థితి ఇలాగుంటే, ఇంకొకరు రాజై ఇంతకన్న హెచ్చు సాధిస్తారన్న ఆశ నాకులేదు. నిన్ను సరి అయిన ప్రజానాయకుడుగా భావించిన నా నిర్ణయం తప్పు! ఒకసారి తప్పుచేశాక మళ్ళీ తప్పుచేయనని నమ్మకమేమిటి? అందుకే నాకు విరక్తికలిగింది. నీకు తోచినవిధంగా నువు రాజ్యం ఏలు; నేను నా ఆశ్రమానికి పోతాను. మళ్ళీ సుదర్భదేశంలో అడుగు పెట్టను.'' అన్నాడు సారంగుడు.





# నక్కకాటుకు చెప్పుదెబ్బ

కాంతమ్మకు భర్త పోయాడు. ముగ్గురు కొడుకులు మిగిలారు. ఆమె కొంతకాలం వాళ్ళతో ఎలాగో ఈదుకొచ్చింది. కాని రోజులు బాగాలేవు. పంటలు సరిగా పండలేదు. కాంతమ్మ కొడుకులకు కూలి పనులు కూడా దొరకటం లేదు.

కొంత బరువు తగ్గినా తగ్గినట్టేనని కాంతమ్మ తన పెద్దకొడుకును వెంకటాపురంలో ఉన్న తన అన్న వద్దకు పంపింది. తన అన్నా, వదినా ఒకరికి ఉపకారం చేసే స్వభావం కలవాళ్ళు కారనీ, లోభులనీ ఆమెకు తెలుసు. అయినా తన కొడుకును భరించలేకపోతారా అనుకున్నది.

వారం తిరగకముందే కాంతమ్మ పెద్ద కొడుకు తిరిగి వచ్చేశాడు. "ఏంరా, ఇంత వేగం తిరిగి వచ్చేశావు?" అని అడిగితే, "అత్తయ్యకు ఒంట్లో బాగా లేదుట. ఆమె ఆరోగ్యం బాగయ్యాక నాకు కబురుచేసి, ఒక నెలరోజులపాటు ఇంట్లో ఉంచుకుంటానన్నాడు, మామయ్య." అన్నాడు వాడు.

కాంతమ్మ వాళ్ళ పిసినికొట్టు తనాన్ని తిట్టుకున్నది.

రోజులు అమితకష్టంగా గడుస్తున్నాయి. కాంతమ్మ ఇంట్లో ఉన్న చెంబూ, తప్పేలా ఒకటొకటే అమ్మి, సంసారం నెట్టుకొస్తున్నది. రాబోయే రోజులు తలుచుకుంటే మాడి చావటం తప్ప మరేమీ కనిపించటంలేదు. కాంతమ్మ ఈ సారి తన రెండో కొడుకును అన్న వద్దకు పంపింది.

వెంకటాపురం వెళ్ళిన రెండోవాడు మూడు రోజులకల్లా తిరిగి వచ్చాడు.

కాంతమ్మకు కొడుకును చూడగానే మండు కొచ్చింది. "ఏం అప్పుడే తిరిగొచ్చావు? ఏం తిందామనుకున్నా విక్కడ? మీ ముగ్గుర్నీ ఇంక నేను పోషించలేను.

గుండాల విజయ

పొండి మీరంతా!'' అని, అలా అన్నందుకు బాధపడి, ఏడుస్తూ కూర్చున్నది.

తల్లి బరువు కాస్త తగ్గించటానికి మూడోవాడు, ''అమ్మా, నేను మామయ్య గగ్గిర కొన్నాళ్ళు ఉండి వస్తాను,'' అని చెప్పి, వెంకటాపురం బయలుదేరాడు.

వాడు వెంకటాపురం చేరి, తన మామయ్య ఇంటికి వెళ్ళేసరికి అరిశెలు తింటున్న అత్తయ్య, వాణ్ణి చూడగానే అరిశెలు దాచేసి, ముసుగు పెట్టేసింది.

వాడితో మామ, ''చూడరా, అబ్బాయి. ఈమధ్య మీ అత్తయ్య ఒంట్లో ఏమీ బాగుండటం లేదు. చాకిరి అంతా నాపైన పడింది. అటు పొలంపనీ, ఇటు ఇంటి పనీ కూడా చేసుకోలేక సతమతమవు తున్నాను,'' అని ఇంకా ఏమో అన బోయాడు.

మూడోవాడు అతనికి అడ్డువచ్చి, ''బాధపడకు, మామయ్యా! నువు అంత కష్టపడుతూంటే చూస్తూ ఊరుకుంటానా? ఇప్పుడే మా ఊరు వెళ్ళి, అమ్మనూ, అన్నయ్యలనూ తీసుకు వస్తాను. అమ్మ వంటపనీ, ఇంటిపనీ చూస్తుంది, మేం ముగ్గురం పొలంపని చూస్తాం. నువు హాయిగా విశ్రాంతి తీసుకో. వస్తానుమరి,'' అని బయలుదేరబోయాడు.

తన ఎత్తు ఇలా బెడిసి కొట్టేసరికి, వాడి మామ నోటమాట రాక, గుడ్లుపెట్టుకు చూస్తూ ఉండిపోయాడు.

కాని, అత్త, ప్రమాదం చప్పున గ్రహించి, ముసుగు తన్నేసి, లేచి కూర్చుని, ''అలా మొద్దులా కూర్చున్నారేమండీ? చూశారా, చిన్న వాడయినా, మీ మేనల్లుడికి నా మీద ఎంత అభిమానమో? నా ఒంట్లో బాగా లేదని తెలియగానే వాళ్ళ అమ్మను తెస్తానన్నాడు! మీ కెప్పుడైనా ఆ పాటి ఆలోచన వచ్చిందా? నా జబ్బుదేముంది? వెళ్ళండి, మీ పొలం పని మీరు చూసు కోండి, మేం ఇంటిపని చూసుకుంటాం,'' అని వాడి ప్రయాణం ఆపింది.

తన ఎత్తు పారినందుకు కాంతమ్మ మూడోకొడుకు సంతోషించాడు.








శ్రీహరి ఒక రైతు కొడుకు. వాళ్ళ పొలానికి వరద బాధ హెచ్చు. అందు చేత అతను వ్యవసాయాన్ని నమ్ముకోవటం ఇష్టంలేక, పట్నంలో బతుకుతెరువు చూసుకుందామని బయలుదేరాడు.

అతను పట్నంలో ప్రవేశించే ముందు, ఊరి చెంతగా ప్రవహించే నదిలో స్నానం చేసి, పొడి బట్టలు కట్టుకుంటూండగా, అక్కడికి నీటికోసం బిందె తీసుకుని ఒక నల్లపిల్ల వచ్చింది.

అతను పట్నం రావటం అదే మొదటి సారి కావటం చేత, "దివాణంలో పని చేసే వీరాస్వామిగారి ఇల్లు ఎక్కడో నీకు తెలుసునా?" అని ఆ నల్లపిల్లను అడిగాడు.

"వీరాస్వామి ఇంటికి రెండిళ్ళు అవతలే మా ఇల్లు. నా పేరు గంగ. వీరాస్వామి కూతురు మంగ నా స్నేహితురాలు. వాళ్ళ ఇల్లు ఆంజనేయస్వామి కోవెల పక్కనే," అంటూ ఆ నల్లపిల్ల నీటిలో బిందె ముంచటానికి వంగి, అంతలో ఉలిక్కిపడి, బిందె పక్కన పెట్టి, మెడ తడుముకోసాగింది.

"ఏమయింది?" అని శ్రీహరి ఆశ్చర్యంగా అడిగాడు.

"మెడలో గొలుసు ఎక్కడో పడి పోయినట్టున్నది. మా పిన్ని నన్ను బతకనియ్యదు," అంటూ గంగ బిక్కమొహం వేసింది. ఆమె సవతితల్లి గయ్యాళిది కాబోలు! గొలుసు కోసం ఆమెతోబాటు శ్రీహరి కూడా వెతికాడు గాని, లాభం లేకపోయింది.

గంగ చీరకొంగుతో కళ్ళు తుడుచుకుంటూ నీళ్ళ బిందె చంకన పెట్టుకుని వెళ్ళిపోయింది నిరాశగా.

శ్రీహరి ఊళ్ళోకి బయలుదేరాడు. అతను నది ఒడ్డున ఉన్న దేవిఆలయంలో

మాచిరాజు కామేశ్వరరావు



కాస్తసేపు ఆగటం వల్ల గంగకు వెనకపడి పోయాడు. ఇంకా జనసంచారం ప్రారంభం కాలేదు.

అతను గుడి దాటి కొద్ది అడుగులు వేశాడో, లేదో, దారిపక్కన పడి ఉన్న గొలుసు ఒకటి కనిపించింది. అదే గంగ పోగొట్టుకున్న గొలుసు అయి ఉంటుం దనుకుని అతను చప్పున వంగి దాన్ని తీసుకున్నాడు. దాన్ని శీఘ్రంగా గంగకు చేర్చితే ఆమెను సవతితల్లి పెట్టే హింస నుండి కాపాడవచ్చు.

అతను కోవెల గుర్తు సహాయంతో గంగ ఇల్లు కనుక్కుని, అక్కడికి వెళ్ళే సరికి, గంగ చేత సవతితల్లి బోలెడు గిన్నెలు తోమిస్తున్నది. అతను గొలుసు పైకి తీసి, "ఇది గంగ గొలుసు. నాకు దొరికింది. దీన్ని గురించి మీరు గంగను ఏమీ అనవద్దు. దారిలో జారిపడిపోయి ఉంటుంది," అంటూ దాన్ని గంగ సవతితల్లికి ఇచ్చాడు.

గంగ సవతితల్లి చప్పున గొలుసు తీసుకుని, "మా వస్తువు మాకు చేరింది. ఇక నువు వెళ్ళవచ్చు," అన్నది.

గంగ యీ జరిగినదంతా ఆశ్చర్యంగా చూసింది.

శ్రీహరి అక్కడినుంచి వీరాస్వామి ఇంటికి వచ్చాడు. అతను ఫలానా అని తెలిసినాక వీరాస్వామి అతన్ని క్షేమ సమాచారాలు అడిగి, ఉద్యోగప్రయత్నం చేస్తానని మాట ఇచ్చి, అతని భోజనం ఏర్పాటు భారం తన కూతురు మంగ మీద వేసి, తాను దివాణానికి వెళ్ళి పోయాడు. మంగ అతనిపట్ల ముభావంగా ఉన్నది.

అతను భోజనం చేసి వీధి గదిలోకి వచ్చేసరికి, గంగ హడావుడిగా వచ్చి, "ఈ గొలుసు నాది కాదు. నా గొలుసు తెగితే, పెట్టెలో పెట్టి, ఆ విషయం మరిచిపోయాను. మీకు దొరికిన గొలుసు మీరే ఉంచుకోండి. మా పిన్ని నన్ను చంపినా సరే నేను దీన్ని ఉంచుకోను.

ఇక వెళతాను. మా పిన్ని నా కోసం గాలిస్తూ ఉంటుంది,'' అంటూ గబగబా వెళ్లిపోయింది.

శ్రీహరి గంగ ప్రవర్తన గురించి ఆలోచిస్తూ, గొలుసును తన సంచిలో వేసి, నిద్రపోయాడు. అతను నిద్ర లేచేసరికి వీరాస్వామి దివాణం నుంచి తిరిగివచ్చి ఉన్నాడు, కాని మంగ ఇంట్లో లేదు: ఎవరో ధనవంతుడి కూతుర్ని పెళ్ళికూతురు చేస్తుంటే చూడబోయింది.

శ్రీహరీ, వీరాస్వామీ కబుర్లు చెప్పుకుంటూండగా నలుగురు రక్షకభటులు వచ్చి, శ్రీహరిని తమ వెంట ధనవంతుడి ఇంటికి రమ్మన్నారు. కారణం తెలియక వీరాస్వామి కూడా శ్రీహరి వెంట వెళ్లాడు.

అక్కడ శ్రీహరి మీద దొంగతనం నేరం మోపబడింది. అసలు జరిగిన సంగతి ఇది:

ధనవంతుడి కూతురు పెళ్ళి నిశ్చయమైనప్పుడు కాబోయే అత్తగారు కోడలి మెడలో ఖరీదైన గొలుసు వేసింది. ఆ కిందటి రోజు ఆ పిల్ల తన స్నేహితురాలితో దేవి ఆలయానికి వెళ్లి తిరిగి వస్తూండగా, కను చీకటిలో ఎవరో ఆమె మెడలో గొలుసు తెంచుకుని పారిపోయారు. ఆమె ''దొంగ! దొంగ!'' అని కేకలు పెట్టేసరికి, నలుగురూ



దొంగను తరిమారు. కాని దొంగ దొరకలేదు. ఆ నగ పోవటం ధనికుడికి అమంగళంగా తోచి బాధపడ్డాడు.

మంగ పెళ్లి కూతురిని చూడటానికి ఆ గొలుసే మెడలో వేసుకుని వచ్చింది! గొలుసును గుర్తించి, నిలదీసి అడిగితే, మంగ, ''నేనే పాపమూ ఎరగను. మా నాన్న స్నేహితుడు శ్రీహరి దీన్ని నాకు బహుమానంగా ఇచ్చాడు,'' అన్నది.

శ్రీహరే దొంగ అనుకుని అతన్ని పట్టుకు రావటానికి రక్షకభటులను పంపారు.

అంతా విన్న శ్రీహరికి పరిస్థితి అర్థమయింది. తాను గొలుసును సంచీలో వేసుకోవటం చూసి మంగ, తాను నిద్ర

పోతున్నప్పుడు కాజేసి, గొప్పకు దాన్ని మెడలో వేసుకుని ధనికుడి ఇంటికి వెళ్ళింది.

''ఈ గొలుసు మంగకు నువే ఇచ్చావా ?'' అని ధనికుడు శ్రీహరిని అడిగాడు.

''అవును!'' అని శ్రీహరి గట్టిగా చెప్పాడు.

''అయితే నువే దీన్ని మా అమ్మాయి మెడ నుంచి లాగేశావన్నమాట!'' అన్నాడాయన.

శ్రీహరి జరిగినదంతా చెప్పి, ''నేను ఈ ఉదయమే ఈ ఊరు వచ్చాను. ఇది దొంగ చేతినుంచి జారిపడి ఉండాలి. నాకు దారి పక్కన దొరికింది.'' అన్నాడు.

ధనికుడు శ్రీహరిని శంకించినందుకు క్షమాపణ చెప్పుకుని, ''ఈ గొలుసు దొరకటమే పదివేలు! పెళ్ళివారి నుంచి మాటపడకుండా బయటపడతాం.'' అని, శ్రీహరికి బలవంతంగా కొంత డబ్బు బహుమతిగా ఇచ్చాడు.

వీరాస్వామి ఇంటికి వచ్చి, తన కూతురు దొంగతనం చేసినట్టు తెలుసుకుని, ''నా పరువూ, నా కూతురి పరువూ కాపాడావు! నీ మేలు మరవను. నీకు నాకూతుర్నిచ్చి పెళ్లిచేస్తాను.ఏమంటావు?'' అన్నాడు.

''క్షమించండి. మీకు నా మంచితనం నచ్చిందేమోగాని, నాకు మీ అమ్మాయి దుర్బుద్ధి ఏమీ నచ్చలేదు. అందం లేకపోయినా గంగ బుద్ధి నాకు నచ్చింది. సవితి తల్లి బాధిస్తుందని తెలిసి కూడా, తన గొలుసు కాదని గంగ గొలుసు నాకు తిరిగి ఇచ్చింది. మీ పిల్ల అదే గొలుసును నా సంచీ నుంచి దొంగిలించింది! ఈ ఇద్దరికీ ఎంత భేదం ఉన్నదో మీరే ఆలోచించండి. ధనికుడు ఇచ్చిన డబ్బుతో నేను ఏ వ్యాపారమైనా చేసుకుని, గంగ ఒప్పుకుంటే ఆమెనే పెళ్లాడతాను.'' అన్నాడు శ్రీహరి.

వీరాస్వామి అతని మాటల్లో నిజం గ్రహించి, మరి మాట్లాడలేదు.





# సామెత సలహా

గోపన్న పన్నెండేళ్ళు గురువు వద్ద విద్యాభ్యాసం చేశాడు. కాని ఏ శాస్త్రంలోనూ ప్రావీణ్యం సంపాదించలేకపోయాడు. అయితే అతను తాను విన్న ప్రతి సామెతనూ, లోకోక్తినీ జ్ఞాపకంపెట్టుకుని, వాటిలో ఉండే జ్ఞానాన్ని గ్రహించాడు. వాడికి చదువులో శ్రద్ధ కుదరటం లేదని గ్రహించిన గురువుగారు వాడికి ఇష్టమైన సామెతలూ, లోకోక్తులూ పనిపెట్టుకుని నేర్పాడు.

గోపన్న చదువు పూర్తిచేసి తిరిగి వచ్చినందుకు అతని ఊరివాళ్ళు సంతోషించారు. కాని అతనికి ఏ వృత్తి చేపట్టాలో తెలియలేదు. ఎందుచేతనంటే అతను ఏ వృత్తికీ పనికివచ్చే చదువు చదువుకోలేదు. అయితే తాను సేకరించిన సామెతల ఆధారంతో ఊళ్ళో వాళ్ళకు సందర్భోచితమైన సలహాలు ఇస్తూండేవాడు. అయితే అతను సంపాదనపరుడు కానందుకు అతని తల్లిదండ్రులు విచారించారు.

లక్ష్మయ్య అనే రైతు బాగా పంట పండించి, డబ్బు పుష్కలంగా ఆర్జించాడు. అతని భార్య నగ చేయించమని కోరింది. ఇలాటి సమస్యలు వచ్చినప్పుడు ఊళ్ళో వాళ్ళు గోపన్న అభిప్రాయం తెలుసుకోవటం రివాజు గనక గోపన్నను లక్ష్మయ్య సలహా అడిగాడు.

"నీ భార్య చెప్పినట్టే చెయ్యి. అందం కోసం పెట్టిన సొమ్ము ఆపదలో అక్కరకు వస్తుంది," అని గోపన్న లక్ష్మయ్యకు సలహా ఇచ్చాడు.

లక్ష్మయ్య ఆ ప్రకారమే భార్యకు నగ చేయించాడు. ఇది జరిగిన రెండు మాసాలకు లక్ష్మయ్య ఇల్లు అగ్నిప్రమాదానికి గురి అయింది. లక్ష్మయ్యా,

పఠాన్ ఖాదర్‌వలీ ఖాన్

అతని భార్యా, పిల్లలూ కట్టుబట్టలతో బయటపడ్డారు. లక్ష్మయ్యకు ఉన్నదంతా బూడిద అయిపోగా, భార్య ఒంటిమీది నగే దక్కింది. అది అమ్మి లక్ష్మయ్య మళ్ళీ ఇల్లు కట్టుకున్నాడు.

గోపన్న సలహా లక్ష్మయ్యను కాపాడిందని తెలిసి, ఊళ్ళో అందరూ తమ సమస్యలకు గోపన్న వద్ద సలహాలు తీసుకుని, లాభం పొందుతూ వచ్చారు. కొందరు అతనికి బహుమానాలు కూడా ఇచ్చారు. అయితే అతనికి సంపాదన కన్న కీర్తి ఎక్కువగా వచ్చింది.

ఒకసారి ఆ దేశపు రాజు మీద ఒక సామంతరాజు తిరుగుబాటు చేశాడు. రాజు కొద్దిసేనతో అతనిపైకి పోతూ, గోపన్న ఉండే గ్రామంలో మజిలీ చేశాడు. ఆ సమయంలో రాజు ఊరి పెద్దలతో బాటు గోపన్నను కూడా కలుసుకున్నాడు.

రాజు తాను సామంతుడిపైన తలపెట్టిన యుద్ధం గురించి గోపన్నకు చెప్పి, సలహా అడిగాడు.

గోపన్న, "రాజా, చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టమన్నారు. మీరు మరి కొంత సైన్యంతో వెళ్ళటం మంచిది," అన్నాడు.

మరికొంత సేనను పంపమని రాజధానికి కబురు పంపి, రాజు తన వెంట ఉన్న సేనతో ముందుకు సాగాడు. సామంతరాజు రాజు వెంట ఉన్న సేన గురించి చారుల ద్వారా తెలుసుకుని, దాన్ని ఎదుర్కొగల బలాలను సిద్ధం చేసుకుని పోరాటానికి దిగాడు. రాజు ఆ పోరాటంలో ఓడినంత పని అయింది. అయితే రాజధాని నుంచి అదనపు బలాలు రావటంతో సామంతరాజు ఓడిపోక తప్పలేదు.

రాజు రాజధానికి తిరిగి వస్తూనే గోపన్నను కబురుపెట్టి పిలిపించి, తాను జరిపిన విజయోత్సవాలలో అనేకమంది కన్న గోపన్నను హెచ్చుగా ప్రశంసించి, సత్కరించటమేగాక, అతన్ని తన సలహాదారులలో ఒకడుగా నియమించాడు.



# అర్థంలేని పని

ఒక రాజుగారు పర్యటిస్తూ ఒక కొంత ప్రాంతంలో వచ్చి ఉండగా ఆయన పుట్టిన రోజు వచ్చింది. చుట్టుపక్కల గ్రామాలలోని ప్రముఖులు రాజుకు కానుకలు తెచ్చి ఇచ్చారు. ఆ సమయంలో ఒక అడవిమనిషి ఒక తపస్సు చేసుకునే ముని నుంచి ఒక మూట కానుకగా తెచ్చాడు. అందులో కొంత మట్టీ, ఒక పిడతలో నీళ్ళూ, రాళ్ళముక్కలూ, గుర్రం వెంట్రుకలూ, టెంకాయా ఉన్నాయి.

రాజు ఒక మూట బంగారు నాణాలు తీసుకుని, సపరివారంగా ముని వద్దకు వెళ్ళి, బంగారం ఆయనకు ఇచ్చాడు. ముని దాన్ని తాకి, "ఈ ప్రాంతం అభివృద్ధికి వినియోగించు," అన్నాడు.

ఇది విని గ్రామంలోని ఒక దురాశాపరుడు ఒక మూటలో ఎండుకర్రలూ, ఇసుకా, ఎండుగడ్డీ, ఒక సారాబుడ్డీ పెట్టి తెచ్చి, రాజుగారికి కానుకగా సమర్పించాడు.

"వీటికి అర్థమేమిటి?" అని రాజు అతన్ని అడిగాడు.

"ముని పంపిన కానుకకు తమరు అర్థం అడగలేదే!" అన్నాడు ఆ దురాశాపరుడు.

"దాని అర్థం నాకు తెలిసింది. మట్టీ, నీరూ బాగా ఉండాలనీ, రాళ్ళతో కోటలు భద్రం చెయ్యాలనీ, గుర్రంసేన అభివృద్ధి చెందాలనీ, నేను టెంకాయలా చూసేవారికి కఠినంగా ఉన్నా, లోపల తియ్యని కొబ్బరిలాగా, టెంకాయపాల లాగా హృదయం ఉండాలని ముని ఆశీర్వదించాడు. నీ కానుకకు అర్థం తెలియలేదు," అన్నాడు రాజు.

ఆ మనిషి రాజుగారి కాళ్ళమీదపడి క్షమాపణ చెప్పుకున్నాడు.






శ్రీపురంలో రాజశేఖరు డనే అజ్ఞాతకవి ఉండేవాడు. అతను సహజకవి కావటం చేత తాను ఎంత ప్రతిభ కలవాడైనదీ అతనికే తెలియదు. అతను పది సంవత్సరాల పాటు విరామం లేకుండా ఒక రసవత్తర కావ్యం రచించి, దాన్ని గురించి నాగభూషణు డనే ఒక పేరుబడిన కవి అభిప్రాయం తెలుసుకోవటం మంచిదని, అతని వద్దకు తన కావ్యాన్ని తీసుకుపోయాడు.

"అయ్యా, ఈ కావ్యాన్ని నేను రచించాను. ఇందులోగల కావ్య లక్షణా లెలాటివో తమరు చూసి చెప్పండి. మీరు ప్రోత్సహించినట్టయితే నేను కవిత్వంలో కృషి చేస్తాను. లేని పక్షంలో కవితా వ్యాసంగం మానేసి మరేదైనా పని చేసుకుంటాను," అన్నాడు రాజశేఖరుడు నాగభూషణుడితో.

నాగభూషణుడు ఆ కావ్యాన్ని అక్కడక్కడా చదివి ఆశ్చర్యపోయాడు. రాజశేఖరుడు మామూలు కవిత్వం రాయగలడని కూడా ఎవరికీ తెలీదు; ఇంత అద్భుత కవిత్వం రాయగలడని ఎవరు అనుకుంటారు? ఆ కావ్యాన్ని తస్కరించాలనీ, దాని సహాయంతో రాజుగారి వద్ద బహుమానం పొందాలనీ నాగభూషణుడికి దుర్బుద్ధిపుట్టింది.

"దీన్ని శ్రద్ధగా చదివి నా అభిప్రాయం చెబుతాను. రెండు వారాల అనంతరం కనిపించు," అని నాగభూషణుడు రాజశేఖరుణ్ణి పంపేసి, ఆ కావ్యాన్ని తన చేతి వ్రాతతో నకలు చేసుకున్నాడు.

రెండు వారాల అనంతరం రాజశేఖరుడు వచ్చి, "నా కావ్యం ఈ పాటికి మీరు చూసి ఉంటారు. మీ అభిప్రాయం తెలుసుకుందామని వచ్చాను," అన్నాడు.

ఎమ్. డి. అబ్దుల్లా

నాగభూషణుడు ఆశ్చర్యం నటిస్తూ, "కావ్యమా ? ఏం కావ్యం ?" అన్నాడు.

"రెండు వారాల క్రితం నేను స్వయంగా వచ్చి, పదేళ్ళు నేను శ్రమించి రచించిన కావ్యం గురించి మీ అభిప్రాయం తెలుసుకుందామని, దాన్ని మీ వద్ద ఉంచి వెళ్లాను, గుర్తులేదా?" అని రాజశేఖరుడు అడిగాడు.

"మీరేమైనా కలగన్నారరా ఏమిటి ? నాకు మీరు ఏ కావ్యమూ, ఎన్నడూ ఇయ్యలేదు. అసందర్భంగా మాట్లాడకండి!" అని నాగభూషణుడు దబాయించాడు.

"మీరు గొప్ప కవి అయి ఉండి, సాటి కవిని ఇలా అన్యాయం చెయ్యటం భావ్యం కాదు," అన్నాడు రాజశేఖరుడు దీనంగా.

"మీరు నాకు కావ్యం ఇచ్చానంటున్నారే, అప్పుడు ఎవరన్నా ఉన్నారా ? నేను అబద్ధమాడిన పక్షంలో వారైనా నిజం చెబుతారు గద!" అన్నాడు నాగభూషణుడు, సాక్షులెవరూ లేరని తెలిసి.

"ఎవరూ లేరు!" అన్నాడు రాజశేఖరుడు.

"ఇక మీ మాట ఎవరు నమ్ముతారు ? దయచెయ్యండి," అన్నాడు నాగభూషణుడు.

మర్నాడు రాజశేఖరుడు రంగభూపాల మహారాజు ఆస్థానానికి వెళ్ళి, తన గోడు విన్నవించుకున్నాడు. రాజు అతని



మాటలు సానుభూతితో విని, భటులను పంపి నాగభూషణుణ్ణి పిలిపించాడు. నాగభూషణుడు కావ్యంతోసహా ఆస్థానానికి వచ్చాడు.

రంగభూపాలుడు కావ్యంలోని లేఖనాన్ని ఇద్దరి లేఖనాలతోనూ పోల్చి చూశాడు. ఆ కావ్యంలోని లేఖనం నాగభూషణుడిది లాగే ఉన్నది.

"మహారాజా, నా కావ్యం అతని ఇంట రెండు వారాలపాటు ఉన్నది. దాన్ని అతను తిరగవ్రాసి ఉండవచ్చు," అన్నాడు రాజశేఖరుడు.

ఆ కావ్యం శ్రీరామచంద్రుడికి అంకితం ఇయ్యబడి ఉండటం రాజు గమనించి, "కవులారా, ఈ మధుర కావ్యాన్ని రచించినది మీలో ఎవరో తెలియదుగాని, దాన్ని నాకు ఎవరు అంకితం ఇస్తే వారిని సన్మానిస్తాను," అన్నాడు.

వెంటనే నాగభూషణుడు, "తప్పకుండా, మహారాజా! మీ అంతటివారు అడిగితే కాదనగలనా?" అన్నాడు.

"మీ అభిప్రాయం ఏమిటి?" అని రాజు రాజశేఖరుణ్ణి అడిగాడు.

"క్షమించండి, మహారాజా! నా ఇష్టదైవమైన శ్రీరామచంద్రుడికి దాన్ని అంకితమిచ్చాను. దాన్ని రాజదర్బారులలో చదివి, బహుమతులు పొందటానికి రాయలేదు. కీర్తి కాంక్ష కూడా నాకు లేదు," అన్నాడు రాజశేఖరుడు సిస్సంకోచంగా.

ఈ సమాధానం విని రంగభూపాలుడు పరమానందభరితుడై, నాగభూషణకవిని చెరసాలలో పెట్టమని భటులను అజ్ఞాపించాడు.

నాగభూషణుడు హడలిపోయి, మహారాజు కాళ్ళమీదపడి, తాను చేసిన నేరాన్ని ఒప్పుకుని, తనను క్షమించమని వేడుకున్నాడు.

రాజు రంగభూపాలుడు అతన్ని గట్టిగా మందలించి, క్షమించి విడిచిపెట్టి, నిండు సభలో రాజశేఖరుడికి బ్రహ్మాండంగా సత్కారం చేశాడు.






ఒక గ్రామంలో ఒక మాంత్రికుడు ఉండేవాడు. నిజానికి అతని వద్ద మంత్రశక్తులేవీ లేకపోయినా, కొంత తంత్ర ప్రజ్ఞ గలవాడు కావటం చేత, అమాయకులైన ప్రజలను మోసగించి, భయపెట్టి, జీవయాత్ర సాగిస్తూవచ్చాడు.

అ గ్రామంలోనే ప్రభాకరుడు అనే యువకుడు ఒకడు ఉండేవాడు. అతనికి మంత్రశక్తులలో నమ్మకంలేదు. ఏవిధంగానైనా ఈ మాంత్రికుడి అసలు రూపాన్ని బట్టబయలు చేయాలని అతని అభిలాష.

ఒక రోజున మాంత్రికుడు ప్రభాకరుడి వద్దకు వచ్చి, అందరినీ అడిగినట్టే, తనకు ఆరు నెలలకు సరిపడా బియ్యమూ, పప్పులూ, నూనెలూ, ఇతర సంబారాలూ ఇయ్యమని అడిగాడు.

ఆ మాంత్రికుడు తాను ఎత్తుతున్నది బిచ్చమే అయినా, వాడు అడిగే తీరూ, దర్పమూ, రీవీ చూసి ప్రభాకరుడికి మండిపోయి, "ఆరునెలలకు కాదు గదా, అరపూటకు కూడా ఇయ్యను! దుర్మార్గుడా, ప్రజలను భయపెట్టి, దున్నపోతులా తింటున్నావు. ముందు ఇక్కడి నుంచి పోతావా, మెడపట్టి వీధిలోకి గెంటమన్నావా?" అని ఉద్రేకంగా అడిగాడు.

మాంత్రికుడు తొణకక, దర్పంగానే, "నా సంగతి నీకు ఇంకా తెలీదురా, కుర్రసన్నాసీ! చూడు, రేపు ఈ పాటికి నిన్ను ఏం చేస్తానో!" అని తన సహజ ధోరణిలో బెదిరించి, అక్కడినుంచి కర్ర తాటించుకుంటూ చరచరా వెళ్ళిపోయాడు.

ప్రభాకరుడు చాలాకాలంగా ఎదురు చూస్తూ ఉండిన అవకాశం ఇప్పుడు వచ్చింది. అతను తన మిత్రులను

కె. నాగమణి

నలుగురినీ కలుసుకుని, మాంత్రికుడి బండారం బయటపెట్టే ఆలోచన ఒకటి వాళ్ళకు చెప్పాడు. అతని మిత్రులు అతను చెప్పినట్టు చేయటానికి ఒప్పుకున్నారు.

మర్నాడు ఉదయం ప్రభాకరుడు విలవిలా తన్నుకుంటూ, రెండు వాంతులు చేసుకుని, పడిపోయాడు. ఇరుగు పొరుగు వారందరూ వచ్చి, ఇదేమిటి అని అడిగితే, ప్రభాకరుడి మిత్రులు, "ఇదంతా ఆ మాంత్రికుడు పగబట్టి చేసిన పనే. వాణ్ణే తెచ్చి ప్రభాకరుణ్ణి బాగుచేయించాలి," అన్నారు.

నలుగురూ కలిసి మాంత్రికుడి వద్దకు వెళ్ళి, "నువ్వు ఆ కుర్రవాడికి చేతబడి చేసి, రోగం తెప్పించావు. వాడు చావు బతుకుల్లో వున్నాడు. వచ్చి నయం చెయ్యి," అని నిలవదీసి అడిగారు.

మాంత్రికుడు బెట్టుగా, "ఎవరు చేసిన పనికి వారు శిక్ష అనుభవిస్తారు. మధ్య నేనేం చేస్తాను?" అన్నాడు.

"నీ బాధ్యత ఏమీ లేదా? మరి ఆ కుర్రవాణ్ణి ఏదో చేస్తానని ఎందుకన్నావు?" అంటూ ప్రభాకరుడి స్నేహితులు మాంత్రికుడి జుట్టు పట్టుకుని బాదసాగారు.

మాంత్రికుడు భయపడిపోయి, "బాబూ, నేను ఏ పాపమూ ఎరగను. నాకు ఏ మంత్రాలూ రావు. అతన్ని భయపెట్టటానికి అలా అన్నాను. నన్ను విడిచిపెట్టండి," అని కాళ్లావేళ్లా పడ్డాడు.

ఈలోగా అక్కడికి వచ్చిన ప్రభాకరుడు, "అది నిజమే. నీకు ఏ మంత్రాలూ రావు, ఏ శక్తులూ లేవు. అవి ఉన్నట్టు లోకాన్ని మోసగిస్తున్నావు గనకనే నీకు ఈ విధంగా బుద్ధి చెప్పవలసి వచ్చింది. ఇకముందు మంత్రాల మాట ఎత్తావో, నిన్ను నిలువునా చీల్చేస్తాం. బుద్ధిగా ఉండు," అని హెచ్చరించాడు.

ఈ వార్త క్షణంలో ప్రక్క గ్రామాలకు కూడా పాకింది. ఆ తరవాత మాంత్రికుణ్ణి లక్ష్యపెట్టినవాళ్ళు లేరు.





# వీరహనుమాన్

మణిపుర రాజ్యాన్ని ఏలుతున్న మణిధ్వజుడు పరాక్రమవంతుడే గాకుండా, గొప్ప శివభక్తుడు. నూరుసార్లు హోమగుండంలో తన శరీరాన్ని దహింపజేసుకున్నాడు. పదిసార్లు తల నరుక్కున్నాడు. అటువంటి ఉగ్ర పూజలతో శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుంటూ, సారెసారెకూ వరాలు పొందిన వీరశైవుడు.

శివుడి త్రిశూలం అతడు కోరినప్పుడు వచ్చి శత్రుసంహారం చేస్తుంది, పాశుపతాస్త్రం కూడ ప్రసాదింపబడింది. తుదకు అతడు కోరినప్పుడు శివుడే వచ్చి అండగా నిల్చి శత్రువులతో యుద్ధం చేసే పెద్ద వరాన్ని కూడా శివుడు మణిధ్వజుడికి ఇచ్చుకున్నాడు. తనకు ఎవరివల్లా అపజయంగాని, ఆపదగాని రాకుండా శివుడే తనకు రక్షగా ఉన్నాడని మితిమీరిపోయిన గర్వంతో విర్రవీగిపోయి మణిధ్వజుడు నిరంకుశంగా పాలిస్తున్నాడు.

శివుణ్ణిగాక ఇతర దేవుళ్ళనూ, మతాలనూ నమ్మినవారినందరినీ దేశం నుండి వెళ్ళగొట్టాడు. శివాలయాలు తప్ప మరే ఆలయమూ లేకుండా ధ్వంసం చేయించాడు. మణిధ్వజుడి వల్ల అగచాట్లు పడుతున్న వారంతా అయోధ్యకు శరణార్థులుగా పోయి, రాముడితో మొరపెట్టుకున్నారు. మణిధ్వజుడి అహంకారం నశించేకాలం ఆసన్నమైందనీ, వారి అగచాట్లు త్వరలోనే తీరుతాయనీ రాముడు వారికి అభయమిచ్చి, అంత

**44. అశ్వమేధ సమాప్తి**



వరకూ తన రాజ్యంలో సుఖంగా ఉండమని శరణుఇచ్చాడు.

స్వైరవిహారం చేస్తూ వస్తున్న రాముడి యాగాశ్వం తొలి డెక్క తన రాజ్య సరిహద్దు మీద పడీ పడగానే, మణిధ్వజుడు దాన్నిపట్టి తన రాజధాని మణిపురం అశ్వశాలలో బంధించాడు.

గుర్రాన్ని విడిచిపెట్టి రాముడిపట్ల స్నేహభావాన్ని చూపవలసిందిగా మణిధ్వజుడికి చెప్పిరమ్మని లక్ష్మణుడు రాచమర్యాదగా దూతను పంపాడు. మణిధ్వజుడు దూత వీపుమీద కాల్చిన త్రిశూలంతో వాతపెట్టించి, "రావణాది శివభక్తులను చంపిన రాముణ్ణి, శివప్రీతిగా భైరవుడి విగ్రహం ముందు చిత్రవధ చేసి, బలి ఇద్దామని ఉవ్విళ్లూరుతున్నాను! కోటిమంది రాముళ్ళు వచ్చినా నాకు లెక్కలేదు. త్రిశూలం ముద్రలు వేయించి పంపుతానని, నేను చెప్పినట్లుగా వెళ్ళి చెప్పు!" అని దూత నెత్తిమీద గంపెడు భస్మాన్ని గుమ్మరింపించాడు.

అంతవరకు ఎటువంటి ఘర్షణా లేకుండా వస్తున్న లక్ష్మణ భరత శత్రుఘ్నులకు మణిధ్వజుడితో యుద్ధం తప్పనిసరి అయింది. భరతుడు పూరించిన పాంచజన్యం లాంటి శంఖధ్వనితో దిక్కులు పిక్కటిల్లుతూండగా, ఒకవంక శత్రుఘ్నుడు సుదర్శన చక్రంలాగ విజృంభిస్తూంటే, తనవంక వెయ్యి పడగలు విప్పి బుసలు కొడుతూన్న శేషసర్పంలాగ ఎత్తివస్తున్న లక్ష్మణుడి ప్రచండ ధాటికి మణిధ్వజుడు తట్టుకోలేక శివుని త్రిశూలాన్ని పిలిచాడు.

అప్పుడు మణిధ్వజుడి పూజామందిరం నుంచి మెరుపులాగ ఉరుముకొంటూ త్రిశూలం లక్ష్మణుడి మీదికి దూసుకుంటూ వెళ్ళింది. సరిగ్గా అదే సమయానికి హనుమంతుడు లక్ష్మణుడికి అడ్డంగా వాలి, ఏనుగు తొండంతో చెరుకుగడను పట్టుకొన్నట్లుగా లక్ష్మణుడిని సంహరించడానికి వస్తున్న శివుడి త్రిశూ

లాన్ని ఎడమచేత్తో ఒడిసి పట్టుకొని, గంభీరాకృతితో శివుడిలాగే నిల్చున్నాడు.

మణిధ్వజుడు సంభ్రమంతో శివుడే దిగివచ్చాడనుకుని చేతులెత్తి జోడించ బోతూంటే నవ్వి, హనుమంతుడు, "ఓయి, శివమహాభక్తుడా! నేను శివుణ్ణి కాను. ఒక కోతిని, హనుమంతుడిని! రాముడి బంటును! తెలిసిందా?" అంటూ గదను ఎత్తి లంఘించాడు.

మణిధ్వజుడు వేటు తప్పించుకొని దూరంగా పారిపోయి హనుమంతుణ్ణి చూసి తెల్లమొహం వేశాడు. హనుమంతుడి జటాజూటం గాలిలో ఎగురుతున్నది. కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. ఒక చేత్తో త్రిశూలాన్ని నేలకు తాటించి పట్టుకొని, అపరమహేశ్వరుడిలాగ నిల్చున్నాడు. తనకు చావు తప్పదనే భయంతో మణిధ్వజుడు ఎలాగో తెగించి పాశుపతాస్త్రం గుర్తు తెచ్చుకొని మంత్రం జపించి, వింటికి సంధించి విడిచాడు.

పాశుపతాస్త్రం వేడికి ఆ ప్రదేశమంతా ఉడికిపోయింది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు వారి సైన్యమూ అంతా నేలకు ఒరిగి మూర్ఛపోయారు. హనుమంతుడు రామనామం జపిస్తూ రొమ్ము విరుచుకొని అస్త్రానికి ఎదురుగా వెళ్లాడు. పాశుపతాస్త్రం హనుమంతుడి గుండెను తాకి చీపురుపుడకలాగ విరిగి హనుమంతుడిలో లీనమైంది. హనుమంతుడు మణిధ్వజుడి రథాన్ని తుత్తునియలు చేసి,





గదతో కొట్టి, అతణ్ణి చంపడానికి విరుచుకు పడ్డాడు. మణిధ్వజుడు దెబ్బతిని చావకుండా, పరుగు పరుగున పారిపోయి పూజామందిరంలో శివలింగానికి తల బాదుకుంటూ, "హరహర మహాదేవా! వేగంగా రా!" అంటూ అరిచాడు.

"ఏమిటిది? మణిధ్వజా! కోటిమంది రాముళ్లు వచ్చినా లెక్కలేదన్నావే, ఒక్క రాముడి బంటును ఎదుర్కోలేవా? వెళ్ళు యుద్ధం చెయ్యి, నీకు అండగా నేను నిలబడతాను!" అని శివలింగం నుంచి మాటలు వినిపించాయి.

ఇచ్చిన వరం ప్రకారం నందివాహనం ఎక్కి శివుడు యుద్ధరంగంలో అండగా మణిధ్వజుడి ముందర సాక్షాత్కరించాడు. హనుమంతుడు శివుడితో, "నువ్వు దేవుడివే కావచ్చుగాని, నీకు నేను జంకేది లేదు, కాచుకో!" అంటూ సింహగర్జన చేసి శివుడి మీదకు బయలుదేరాడు. నంది బెదిరిపోయి శివుణ్ణి క్రిందకు పడద్రోసి పారిపోయింది.

శివుడు సర్దుకొని లేచి హనుమంతుడితో, "నా త్రిశూలాన్ని పట్టేశావు, పాశుపతాస్త్రాన్ని నీలో ఐక్యం చేసుకున్నావు. ఇలా చేయడం విష్ణుదేవుడికి ఒక్కడికే సాధ్యం. నువ్వు విష్ణువా? విష్ణు భక్తుడివా? ఎవరు నువ్వు?" అన్నాడు.

"మీ దేవుళ్ళతో నాకు నిమిత్తం లేదు, నేను మానవుడైన రాముణ్ణి నమ్ముకొన్న వాడిని. కోతినైన నాకు ఆ మానవుడే దేవుడు. బుద్ధి కూడా కోతిలాగే అతి చంచలమైనది. నా బుద్ధిని ఏకాగ్రతతో ఉత్తమ మానవుడి మీద నిలిపి అంతులేని మనోబలాన్ని, సాహస పరాక్రమాల్ని పొందాను. దీన్ని భక్తి అన్నా, లక్ష్య సాధన అన్నా రెండూ ఒకటే! లోక కళ్యాణం కోసం నేను నమ్మిన మానవుడు చేస్తున్న అశ్వమేధ యాగాన్ని ఏ దైవ భక్తీ, ఎటువంటి శక్తులూ అడ్డలేవు. భక్తులమని చెప్పి మణిధ్వజుడు లాంటి వాళ్ళు చేస్తున్నదేమిటి? ఇలాంటి అహం

కారులకు, స్వార్ధపరులకు అండగా నిల్చే దేవుళ్ళు లేకపోతేనేం?'' అని హనుమంతుడు దిక్కులు దద్దరిల్లేలాగ గద్దించాడు.

ఆ మాటలకు శివుడు నవ్వుకొని, లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుంటూ, ''నా ఫాలనేత్రాన్ని తెరుస్తున్నాను, కాచుకో!'' అన్నాడు.

''త్వరగా తెరు! నీ భక్తుడికి కనువిప్పు కలిగించు!'' అన్నాడు హనుమంతుడు.

శివుడు తన మూడో కన్ను తెరవగానే భగ్గున ప్రళయాగ్ని హనుమంతుడి మీదకు దూసుకు వచ్చింది. హనుమంతుడు కుడి చేయి చాచి, అగ్నిని దోసిట్లో పట్టి, ఒకప్పుడు శివుడు హాలాహలాన్ని తాగి నట్లుగా, ''రామార్పణమస్తు!'' అంటూ నోట్లో వేసుకొని గుటుక్కున మింగేశాడు.

శివుడు మణిధ్వజుడిని చూసి, ''అంతా చూశావుగా! ఇహ నేను చేయగలిగింది ఏమీ లేదు. హనుమంతుడు ఎవరో కాదు, నా ఆత్మస్వరూపమే! నా అంశతో అవతరించిన అతనిలో, నా సర్వశక్తులూ లీనమైనాయి. అతనివల్ల భక్తి అంటే ఏమిటో తెలుసుకో!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

ఈ లోగా హనుమంతుడు రివ్వున ద్రోణగిరికి వెళ్ళి సంజీవకరణిని పెళ్లగించి



తీసుకొని వచ్చి, మూర్ఛపడి వున్న లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనూ, సైన్యాన్నీ బ్రతికించాడు.

మణిధ్వజుడికి కనువిప్పు కలిగింది. హనుమంతుడి ముందు మోకరిల్లి అంజలి ఘటించాడు. హనుమంతుడు అడిడితో, ''మణిధ్వజా! స్వార్ధంతో నీ భక్తి ఎంత క్షుద్రమైపోయిందో గ్రహించావా? స్వప్రయోజనాల్ని కోరి ఈశ్వరుణ్ణి సేవకుడిగా వినియోగించుకోవడం భక్తి కాదు; జీవకోటి సుఖంగా ఉండాలనే ఈశ్వర సంకల్పాన్ని నెరవేర్చడమే భక్తి! నీలాంటి వారివల్ల దేవుళ్ళ పరువు పోతున్నది. భక్తులనిపించుకొనే స్వార్ధపరులనూ,



అహంకారులనూ ఏవగించుకొని, మంచి వాళ్ళు నాస్తికులుగా మారుతున్నారు! ఇప్పుడు నీ అజ్ఞానం తొలగింది గనుక, ఇకనుండి ద్వేషం వదలి దైవత్వం అన్నిటిలోనూ ఒకటేనని గుర్తుంచుకొని, ప్రజలందరి సుఖమే నీ పరమావధిగా పాలించు!'' అని చెప్పాడు.

అప్పుడు మణిధ్వజుడు, ''ఆంజనేయ స్వామీ! గర్వం మితిమీరి భంగపడితేనే గాని జ్ఞానం రాదు. నా గర్వం మితిమీర డానికే శివుడు నేను కోరిన వరాలన్నీ ఇచ్చాడని ఇప్పుడు అర్థం చేసుకున్నాను. గర్వంతో నేను బంధించిన యాగాశ్వం నాకు మేలే చేసింది, జ్ఞానోదయం కలిగించింది. ఇదంతా రాముడి దయ అనుకుంటాను. నేను రాముడి దగ్గిరకు వెళ్ళి క్షమాపణ వేడుకొని, నన్ను తన బంధుకోటిలో చేర్చుకోమని అర్థిస్తాను!'' అని చెప్పి యాగాశ్వాన్ని తెచ్చి వినమ్రుడై లక్ష్మణుడికి అప్పగించాడు.

యాగాశ్వాన్ని స్వేచ్ఛగా వదలి అందరూ దాని వెంట బయలుదేరారు. వారికి మణిధ్వజుడు ఘనంగా వీడ్కోలు ఇచ్చాడు.

మణిధ్వజుడికి శుభ, శోభ అనే ఇద్దరు చక్కని కుమార్తెలున్నారు. వాళ్ళు కూడా కవలలుగా పుట్టినవారే. వారిని వెంటబెట్టుకొని మణిధ్వజుడు అయోధ్యకు వెళ్ళి రాముణ్ణి, తన తప్పిదాన్ని మన్నించమని వేడుకున్నాడు. రాముడు మణిధ్వజుణ్ణి మిత్రుడిగా ఆదరించాడు. తరువాత మణిధ్వజుడు తన కుమార్తెలను లవకుశులకు వధువులుగా అంగీకరించి తనకు రఘువంశంతో బాంధవ్య భాగ్యం కలిగించమని అర్థించాడు. రాముడు అంగీకరించి అశ్వమేధం పూర్తికాగానే పెళ్ళిళ్ళు జరపవచ్చునని అన్నాడు. మణిధ్వజుడు తాను వెళ్ళగొట్టిన వారినందరినీ సాదరంగా తన రాజ్యానికి తీసుకువెళ్ళి, ప్రజా శ్రేయస్సునే శివపూజగా, ప్రజా సేవనే భక్తిగా ఎంచి రాజ్యపరిపాలన సాగించాడు.

రాముడి యాగాశ్వం తూర్పునుండి దక్షిణ పడమరలను నానాదేశాల్లో తిరిగి, స్వేచ్ఛగా అయోధ్యకు తిరిగి వచ్చింది. అశ్వమేధ పరిసమాప్తికి కిష్కింధ నుండి సుగ్రీవాది వానరులు, లంక నుండి విభీషణుడు, మణిపురం నుండి మణిధ్వజుడు, అనేకమంది దేశదేశాల రాజులు గొప్ప కానుకలతో వచ్చారు. విభీషణుడు మంచి ముత్యాలను, పగడాలను బండ్లతో తెచ్చాడు. సుగ్రీవుడు వజ్రాలను, బంగారాన్ని తీసుకువచ్చాడు. మణిధ్వజుడు గరుడపచ్చలను, కెంపులను, చీనాంబరాలనూ తెచ్చాడు. దేశదేశాల రాజులు తెచ్చిన వెండిబంగారాలతో కోశాగారం నిండిపోయి, ఆరుబయట రాసులుగా పోగుపడ్డవి.

లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నానాదేశాల్లో ఘనస్వాగతాలు, రాచమర్యాదలు పొంది దిగ్విజయంగా సేనలతో అయోధ్యకు చేరుకున్నారు. వారి వెనకగా హనుమంతుడు భరద్వాజ, గౌతమ, అత్రి, అగస్త్యాది ఋషులతో వచ్చాడు. రాముడికి అస్త్ర గురువైన విశ్వామిత్రుణ్ణి ప్రత్యేకంగా ఆహ్వానించుకొని వచ్చాడు.

అశ్వమేధయాగం పరిసమాప్తి ఘనంగా జరిగింది. రాముడు ధనధాన్యాలను ఇంటింటికీ పంపించాడు. రాజ్యంలోని పుణ్యస్త్రీలందరికీ రత్నాల నగలనూ, బంగారాన్నీ పంచిపెట్టాడు. ప్రజాహిత కార్యాలు చేసేవారికి అనేక విలువైన బహుమతులను యిచ్చి సన్మానాలు జరిపించాడు.

తరువాత అందరూ మణిపుర రాజ్యానికి మణిధ్వజుడి ఆహ్వానంపై తరలివెళ్లారు. మణిపురంలో కుశుడికి శుభతోను, లవుడికి శోభతోను వైభవంగా వివాహం జరిగింది. పెళ్ళి సందర్భంలో మణిధ్వజుడు తన రాజ్యాన్నంతనూ లవకుశులకు కానుకగా చదివించి, కొన్నాళ్ళ తర్వాత తపస్సు చేసుకోడానికి అరణ్యానికి వెళ్ళిపోయాడు.



# రాక్షసుడుగా మారిన రాజు



అనేకవేల సంవత్సరాల క్రితం సౌదాసుడు అనే రాజు అరణ్యమార్గాన నడుస్తూండగా శక్తి అనే యువ తాపసి ఎదురయాడు.

"నేను రాజును. నాకు దారి విడు," అన్నాడు సౌదాసుడు.
"నువే ఒక తాపసికి దారి ఇయ్యరాదా?" అని శక్తి అడిగాడు. రాజు మండిపడి తాపసిని కొట్టాడు.





"రాజు కాదుగదా, నువు మానవుడుగా ఉండటానికి కూడా అర్హుడవు కావు. రాక్షసుడివై పో," అని శక్తి సౌదాసును శపించాడు.



చెట్టు మీద ఉండే ఒక బ్రహ్మరాక్షసి శాపసి శాపం విని, రాజును ఆవహించింది. రాజు దాన్ని నిరోధించలేక పోయాడు.



రాజు భయంతో పరిగెత్తసాగాడు. అతని ముఖం భయంకరంగా మారింది. అతను అరణ్యం మధ్య ఒక కుటీరం చేరేసరికి, పూర్తిగా రాక్షసుడయాడు.



ఆ కుటీరం మరెవరిదో కాదు, శక్తిదే. భయంకర రాక్షసుడుగా మారిన సౌదాసుడు శక్తిని పట్టుకుని మింగేశాడు.



రాక్షసుడి కోపం అంతటితో తీరలేదు. శక్తికి అరణ్యంలో నూరుమంది భ్రాతలున్నారు. సౌదాసుడు వారినందరినీ వెతికి పట్టుకుని, మింగేశాడు.



శక్తీ, అతని సోదరులూ వశిష్ఠుడి కొడుకులు. వశిష్ఠుడు తన కొడుకుల దుర్దశ గురించి విని, ఎంతో దుఃఖించి, ఆత్మహత్య చేసుకుందామనుకున్నాడు.



వశిష్ఠుడు ప్రాణత్యాగం చేసుకునేందుకు ఒక నదిలో దూకాడు. వెంటనే నది నూరు పాయలుగా చీలి, వశిష్ఠుడు మునిగేపాటి నీరు ఎక్కడా లేకుండా చేసింది. ఆ నది పేరు "శతద్రు".



వశిష్ఠుడు మరొక నదికి వెళ్ళి, ఈద టానికి వీలు లేకుండా చేతులు కట్టేసుకుని, అందులో దూకాడు. కాని నదీదేవత వశిష్ఠుడి చేతికట్లు విప్పి, ఆయనను ఒడ్డుకు తోసేసింది. ఆ నదికి "విపాశ" అని పేరు వచ్చింది.



వశిష్ఠుడు ఇంటికి తిరిగివస్తూ, తన వెనక ఎవరో వేద పఠనం చెయ్యటం విని, తిరిగి చూశాడు. ఆయన వెనకగా శక్తి భార్య వస్తున్నది. ఆమె గర్భంలోని శిశువు వేదపఠనం చేస్తున్నాడు. తన వంశం నిలిచినందుకు వశిష్ఠుడు సంతోషించాడు.



త్వరలోనే రాకసుడు వశిష్ఠుణ్ణి మింగ టానికి వచ్చాడు. వశిష్ఠుడు వాణ్ణి నిర్మూలించగలిగి ఉండి కూడా, తన కమండలోదకం చల్లి, రాక్షసుణ్ణి తిరిగి సౌదాసుడుగా మార్చాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఒకరాజు ఒకనాడు ఒక సన్యాసిని చూడవచ్చి, నమస్కరించి, "మహాత్మా, ఈశ్వరుణ్ణి చేరుకోవటానికై తమబోటి పుణ్యాత్ములు లోకంలో గల సమస్తాన్నీ త్యాగం చేస్తారు. అది మా బోటి వాళ్ళకు సాధ్యం కాదు. నేను ఇహలోక బంధాలనుండి విముక్తి పొందలేక ఎన్ని పాపాలు చేస్తున్నానో నాకే తెలీదు," అన్నాడు.

సన్యాసికి రాజు ధోరణి విసుగు పుట్టించింది. ఆయన రాజుతో, "అదేమిటి, రాజా! నువు నా కన్న గొప్ప త్యాగివి. నీ కాళ్ళు కడిగి నేను నెత్తిన చల్లుకోవాలి," అన్నాడు.

రాజుకు ఆ మాటలలో వెటకారం ఉన్నదేమోనని అనుమానం కలిగి, "అలాగంటారేం, స్వామీ?" అని అడిగాడు.

"నిజమే చెప్పాను, నాయనా! ఈ లోకం ఎక్కువా, దేవుడెక్కువా?" అని సన్యాసి అడిగాడు.

"దేవుడే ఎక్కువ!" అన్నాడు రాజు.

"నేను లోకాన్ని త్యాగం చేస్తే, నువు ఏకంగా దేవుణ్ణే త్యాగం చేశావు గద! నీ త్యాగం ఎంత గొప్పది!" అన్నాడు సన్యాసి. —నాయర్.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు **600 026** అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు మే 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, జులై నెల చందమామలో ప్రకటించబడును.

---

మార్చి నెల పోటీ ఫలితం: యోచన లేని యాచన

గెలుపొందిన వారి పేరు: ఎం. రమేష్, స్టోన్‌హౌస్ పేట, నెల్లూరు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 జులై నెల సంచికలో ప్రకటింపబడును.







Srivatsa S. Vati

Azmat A. Syed

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వద్దంటే తాగావు

రెండవ ఫోటో : వచ్చింది జ్వరము

పంపినవారు : జి. మురళీమోహన్‌రెడ్డి, 312 కొత్తవీధి, తిరుపతి.

**బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

**Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI**


THE
COMMERCIAL
SERVICE OF
SRI LANKA
BROADCASTING
CORPORATION

# ఇప్పుడు మీరు అతని పళ్లను పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

## వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.

పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు. దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి




నోటిలో ఊరే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.




సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది. ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.




### పిప్పి పళ్లను నిరోధించే టూత్‌పేస్ట్.

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2— దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్లతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్లకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తినిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. నేను చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు, మీ దంత వైద్యుని కూడా అడగండి.



## సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో

కుటుంబంలో వారికి పిప్పి పళ్లు రాకుండా నిరోధిస్తుంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2-1-223 TL